# ముఖచిత్రం

''వెన్నెలస్నానం'' అనే చిత్రాన్ని రచించిన వారు కార్తీక్‌చంద్ర. ఇది అధివాస్తవిక చిత్రకళా సంప్రదాయానికి చెందింది. భారతదేశానికి అధివాస్తవిక కళాసంప్రదాయం కొన్ని పక్షాలు రవీంద్రనాథ్‌టాగోర్‌తో వచ్చాయని చెప్పవచ్చు భారతదేశంలో ఈకళను కౌగిలించుకొంది మొట్టమొదటిగా ఠాగోరె ఆయన ఒకసారి (1941 May 25) అంటారు: ''సృష్టి కేవలం పునరుక్తీకాదు, పునశ్చరణమూకాదు. అలాగని సదృశమూ కాదు. వస్తువుకు దాని ప్రతినిథి చిత్రానికి మధ్యతేడా ఉంటుంది. మనిషిలో స్వాప్నిక జగత్తు ఉంది, స్వైరకల్పనా ప్రపంచం ఉంది. నేను ఈ ప్రపంచాలను చిత్రించడం మొదలు పెడితే ఆ సృష్టికర్తనే ఓడిస్తాను. ఎలాగంటే అతడు సృష్టించిన ఈ ప్రపంచంలో స్వాప్నిక, ఊహావస్తువులకు స్థానం కల్పించలేకపోయాడు''.

ఆ తర్వాత ౧౨౬౦ల నుంచి భారతీయ చిత్రకారులు అధివాస్తవికతను చాల ఉదారంగా స్వీకరించ మొదలు పెట్టారు.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.


సంపుటి 9 మే 1997 సంచిక 4

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయసూచిక




విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **"వెన్నెలస్నానం"** – కార్తీక్ చంద్ర

**Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Chaos in the Age of Unreason

Creativity flows from chaos. This is true for every facet of human endevour, be it the arts or something as mundane as corporate planning, according to Professor Charles Handy, venerable management expert, social philosopher and author.

According to the dapper British management expert, warned of a chaotic situation that the corporate boardrooms across the world would in the coming century. The corporate world's insatiable desire to acquire more money, power and status through mergers and acquisitions had resulted in chaos.

According to Mr. Handy, big was no longer beautiful. This was applicable both in the case of large corporations as well as nation-States. Giving eamples of the latter, he cited the cases of Denmark, Sweden and Switzerland. According to him, the most efficient economies were those that were small and manageable.

The people in these countries are rich and happy in sharp contrast to the people of Japan who are rich but very dissatisfied. He claimed that the Japenese had not yet drawn the line between their desire for "more and big" as opposed to "better and smaller".

The professor felt that the Japanese corporate ethos resulted in a situation where man had become the slave of the big corporate organization. Younger Japanese people want to move out of this nexus and are demanding a better quality of life. According to Professor Handy this desire was healthy. He deals with this problem in his book The Age Of Unreason.

---

## China : Volunteers for Gallows

" Volunteers for gallows" were not confined to Russian communism alone. The Chinese communists had out-beaten the Soviets.

In explaining the Cheng Feng Movement in 1942, Mao indicated his view of how men could be persuaded to an appreciation of communism. " If the reasoning is good, if it is to the point, it can be effective. The first method in reasoning is to give the patients a powerful stimulus, yell at them" You are sick! so the patients will have a fright and break out in an over-all sweat; then, they can be carefully treated." This clinical approach was followed throughout China on a monumental scale in 1949-50.

★ This phrase was coined by Bela Szasz, the Hungarian communist leader, himself a victim of 'show trials'.

# రచన-అస్తిత్వం

సంక్షిప్తానువాదం : బి. తిరుపతిరావు -నాదిన్ గోర్డిమర్

'ఆదియందు వాక్యము ఉన్నది.'

వాక్యము దేవుడితో వుంది సంకేతింపబడిన దేవుడివాక్యం. ఆవాక్యమే సృష్టి. శతాబ్దాల మానవ సంస్కృతి చరిత్రలో వాక్యం అనేక మతపరమైన, లౌకికపరమైన ఇతర అర్థాల్ని తీసుకుంది. వాక్యాన్ని కలిగివుండటం అంతిమంగా అధికారాన్ని కలిగివుండటంగా పరిణమించింది. ప్రతిష్ఠ భయభీతితో కూడివుంది. వాక్యం ఆకాశంలో విహరించింది. గోళాల్ని తాకివచ్చింది. వచ్చిందని చెప్పబడుతున్న స్వర్గానికి, ఇంతకు ముందెన్నడూ లేనంత చేరువలో ఇప్పుడు 'వాక్యం' వుంది. కానీ, నాకు, నాలాంటి వాళ్ళకి దాని మౌలికమయిన మార్పు అది రాతిఫలక మీద చెక్కబడ్డప్పుడు, పపైరస్‌మీద దాని జాడలు తీసినప్పుడు జరిగింది. అది శబ్దంనుంచి దృశ్యంగా భౌతిక రూపం పొందినపుడు, వినటం నుండి చదవబడే సంకేతక్రమంగా మార్చబడినపుడు, ఆతర్వాత రాతప్రతిగా మారినపుడు, క్రమంగా చర్మాల మీద నుండి రాత గూటెన్‌బర్గ్‌దాకా అభివృద్ధిచెందినపుడు జరిగింది. ఎందుకంటె ఇది రచయిత పుట్టుకకి సంబంధించిన క్రమం. ఇది రచయితని అస్తిత్వంలోకి తెచ్చినకథ.

మనం భాగస్వాములుగా వున్న సమాజం గురించిన మన పరిశీలనలను వాక్యం ద్వారా వ్యాఖ్యానించే ప్రయత్నంలో మన జీవితాలన్ని గడుపుతుంటాం. ఈ అర్థంలోనే చెరిపివేయలేనటు వంటి, తెంచుకోలేనటువంటి ఈ నిమగ్నతలోనే, రచన చేయటం అన్నది ఆత్మిక, ప్రాపంచిక శోధనగా వుంటుంది. ఈ శోధన వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ కూడా వుంటుంది.

జీవుల్లో తనగురించిన స్పృహ మనుషులకిమాత్రమే వుంది. మంచికో, చెడుకో ఈ స్పృహ మనుషుల్లో తామెందుకువున్నాము అనేవిషయాన్ని తెలుసుకోవాలనే కోర్కెని రేకెత్తిస్తూవుంది. మనం ఇక్కడ ఎందుకువున్నాం అనేది మతాలు, తాత్వికులు అంతిమ సమాధానాలు చెప్పటానికి ప్రయత్నించినా అది అస్తిత్వ సిద్ధాంత సంబంధమైన ప్రశ్నకాదు. మనుషుల్లో తమగురించిన స్పృహ ప్రారంభమైన దగ్గరనుంచీ పునఃసృష్టి, మృత్యువు, రుతువులమార్పు, భూమి, సముద్రం, గాలి, నక్షత్రాలు, సూర్యచంద్రులు, సమృద్ధి, బీభత్సం మొదలైన సాధారణ దృగ్విషయాల గురించి తెలుసుకోవటం, వివరణలు యిచ్చుకోవటం జరుగుతూనేవుంది. పుక్కిటిపురాణాలలో రచయితలకి పూర్వంవున్న మౌఖిక కథలు ఈ మార్మికమైన అంశాల్ని, ఊహాత్మక అనుభవశక్తిని కథలుగా మార్చుతూవున్నారు.

రోలాండ్‌బార్త్ 'మిత్‌కువుండే లక్షణం ఏమిటిని' ప్రశ్నించి, 'అర్థాన్ని రూపంలోకి మార్చటం' అని సమాధానం చెబుతాడు. ఈ క్రమంలో తెలిసినదానికి, తెలియనిదానికి మధ్య మధ్యవర్తిత్వం వహించే కథలే/మిత్‌లు. అభూతకల్పనకి, డిటెక్టివ్ కథకి మధ్యవుండే ప్రక్రియ మిత్ అంటాడు క్లాడ్‌లెవీస్ట్రాస్ గమ్మత్తుగా. మిత్ అంటే మార్మికత ప్లస్ అభూతకల్పన దేవుళ్ళు, మానవలక్షణాలు ఆపాదింపబడిన జంతువులు, పక్షులు, భూతాలు అన్నీకూడా ఈ మార్మికతకి ఊహల్లోంచి

★ శ్రీ **బి.తిరుపతిరావు** ప్రసిద్ధ సాహితీ విమర్శకుడు విజయవాడ సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్సు కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

ఏదో ఒకరకపు సమాధానాన్ని యిచ్చే ప్రయత్నమే. మనుషులు, వాళ్ళ సహజీవులు కధకి భౌతిక వాస్తవికతలు. కానీ, 'కళప్రాతినిధ్యం వహించేది శరీరానికికాదు, శరీరం సృష్టించిన శక్తులకు-' అంటాడు నికొస్ కజాన్ జాకిస్ (**Nikos Kazant Zakis**).

ప్రాకృతిక దృగ్గోచర అంశాలకి సంబంధించి రుజువుచేయబడిన అనేక వివరణలు వున్నాయి. ఈ సమాధానాలనించి ఇవాళమళ్ళీ కొత్తగా తలెత్తిన ప్రశ్నలు వున్నాయి. ఈ కారణంచేత మనం కాలంచెల్లింది అని అనుకోవాలనుకుంటున్న మిత్ అనే ప్రక్రియని మనం పూర్తిగా వదిలేయలేదు. అంతర్జాతీయ మెగాసంస్కృతి నించి అడవులచేత, ఎడారులచేత రక్షింపబడిన ఏదోవొక మారుమూల ప్రదేశంలో, పిల్లల పడక సమయంలో చదువుకునేది మిత్. కుదింపబడినప్పటికీ వ్యక్తికీ, అస్తిత్వానికి మధ్యవర్తిగా నిలిచేకళని అందించటానికి మిత్ సజీవంగానే వుంది. కొత్త మిత్‌లు విజ్ఞానాన్నందించటమో లేక తమ అస్తిత్వబీభత్సాలను ఎదుర్కోవటానికి సిద్ధంగా లేక ప్రజల్ని ఊహాత్మక మార్గంలోకి పలాయనం చేయించటానికి ఉద్దేశించినవి కావు. అస్తిత్వశక్తులు యింకామిగిలే వున్నాయి. వాటినే రచయిత యివ్వాళ తన రచనలో ప్రదర్శిస్తాడు. ఈ రచయిత నిర్మించే మిత్‌లు ప్రాచీనకాలపు మిత్‌కి దగ్గరగా వుంటాయి తప్ప, సమకాలీనంగా పాపులర్ మిత్‌లు నిర్మించే వాళ్ళకి దగ్గరగా కావు.

చూపిన, చూడబడని, వ్యక్తంచేయబడ్డ, వ్యక్తం చేయబడని అనేక అంశాలచేత నిర్మించబడింది. వాస్తవికత అయినప్పటికీ మనోవిశ్లేషణనుండి ఆధునికతా వాదం వరకు ఇంకా ఆధునికానంతరవాదం, నిర్మాణవాదం, నిర్మాణ వాదానంతర వాదం అన్నిటి సాహిత్య పరిశీలనా లక్ష్యం ఒక్కటే, అదిస్థిరత్వాన్ని గుర్తించటమే. ఒక ప్రత్యేక పరిశీలనా పద్ధతి ద్వారా అస్తిత్వపు శక్తిని రచయిత ఎలా తన గ్రహణశక్తితో ప్రదర్శించగలిగాడు అనేదాన్ని నిర్దిష్టంగా పరిశీలించటమే. జీవితం దానికదే అనిశ్చిత సంఘటనల మీద ఆధారపడివుంటుంది; అస్తిత్వం నిరంతరం పరిస్థితులద్వారా, విభిన్న చైతన్య దశలద్వారా ఆకర్షించబడి రూపుదిద్దబడుతూ వుంటుంది. పరిశుద్ధమైన అస్తిత్వస్థితి అంటూ ఏదీ వుండదు. దీన్ననుసరించి పరిశుద్ధమైన వాచకం కూడా ఏమీ వుండదు.

ఎంత ఆసక్తికరంగావున్న విమర్శనాత్మక పరిశీలనా పద్ధతి ద్వారా దీన్ని చేరుకోవటం కష్టం. వినిర్మిస్తున్నాం అనటం ఒకరకంగావైరుధ్యం. ఎందుకంటే వినిర్మించటం అంటేమళ్ళీ ముక్కలతో నిర్మించటమే. కాబట్టి సాహిత్యపరిశోధకులు ఏదో ఒకరకమయిన కథారచయితలుగానే మిగులుతారు.

అస్తిత్వానికి సంబంధించిన ఏదో ఒక అవగాహనకి రావటానికి సాహిత్యం తప్ప వేరుమార్గం ఏమీలేదేమో? రచయితలు తాము చేసేపనిని తామే విశ్లేషించుకోరు. అలా విశ్లేషించటం లోయలో తాటిపైనడక. ఇలా చెప్పటం రచనాక్రమాన్ని మార్మీకరించటానికి కాదు, రచయిత తనలోవున్న అగాధాల్ని దాటటానికి అతనికి కావలసిన ప్రగాఢమైన దీక్షని గుర్తుచేయటం మాత్రమే. ఎంత గొప్ప రచయితయినా రక్తసిక్తము, సౌందర్యాత్మకము అయి మన అస్తిత్వ అనుభవపు చిక్కుదారిమీద క్రాంతిని ప్రసరిస్తాడు.

సాహిత్యం అంటే ప్రపంచాన్ని కళాత్మకంగా పరిశోధించటం అనే క్లుప్త నిర్వచనం యిచ్చాడు, ఆంథోని బర్జెస్. రచన అక్కడమాత్రమే మొదలౌతుంది. పరిశోధన దాన్ని దాటిపోతుంది. కళాత్మక రూపం మాత్రమే దాన్ని ఆవిష్కరిస్తుంది.

వాక్యాన్ని పొందినవాడు రచయిత ఎలా అయ్యాడు. నేను రచయితని కావటం ఎలా మొదలైంది అనే అంశం ఆసక్తికరంగా వుంటుందనుకోను. ఇంతకుముందు ఇక్కడ నిలబడి మాట్లాడిన వాళ్ళకంటే భిన్నంగా ఏమీవుండదు నాప్రారంభం. నాకాల్పనిక సాహిత్యం కంటే వాస్తవమైన విషయాలు వేరేమీ నేను చెప్పటం కానీ, రాయటం కానీ చేయలేదు. జీవితము, అభిప్రాయాలు రచనకాలేవు. జీవితం బయట వుండటం, నిమగ్నంకావటం ఈరెంటిమధ్యవుండే ఉత్కంఠతలోని ఊహాత్మకత రెండింటినీ మార్చివేసింది. నాగురించి నేను కొంత అనుకరణాత్మకమైన వివరణ యిస్తాను. నేను సహజ రచయితగా పిలవబడతాను. అలా పిలవబడాలనే ప్రయత్నం నేనేమీ చేయను. రచనని జీవనాధారం చేసుకోవాలని నేను ప్రారంభంలో అనుకోలేదు. చూపులు, వాసన, అనుభూతి అనే ఇంద్రియాలద్వారా ఒక చిన్న పిల్లగా జీవితాన్ని, నేను అవగతం చేసుకున్న జీవితాన్ని చిన్నపిల్లగా వుండే ఉత్సాహంతోనే రాశాను. నన్ను సందిగ్ధతకి, ఉద్రేకానికి గురిచేసిన అనుభూతులే ఒక ఆకారం తీసుకుంటూ అక్షరరూపంలో నాకు విజ్ఞానాన్ని, ఉపశమనాన్ని, ఆనందాన్ని యిచ్చాయి. ఆకాలంలోనేను వాక్యాల్ని సరిదిద్దుకుంటూ, నేను చదివినవాటిని తిరగ రాసుకొంటూ నా రచనావిధానాన్ని రూపకల్పన చేసుకుంటూ వుండేదాన్ని ఒకరకంగా నాది జిప్సీజీవితం. ఆప్రాంతంలో వున్న గ్రంథాలయమే నాపాఠశాల. ప్రేస్ట్, చెహోవ్, డాస్టోవస్కీ లాంటి నారచనా అస్తిత్వానికి కారకమైనవాళ్ళే నాప్రొఫెసర్లు. ఆదశలో పుస్తకాలనుంచే పుస్తకాలు పుడతాయనే సిద్ధాంతానికి నేనొక సాక్ష్యం. అయితే ఆదశలో నేను ఎక్కువ కాలం వుండలేదు. నేనే కాదు శక్తివంతమయిన ఏరచయిత ఒకే దశలో వుండడు.

యవ్వనంలో, పిల్లలభావనా ప్రపంచం, క్రీడలకి, పగటికలలకి, ప్రేమకి అనుసంధానించ బడుతుంది. కానీ ఏదో ఒకరంగంలో కళాకారుడుకాబోయే వ్యక్తికి 'పుట్టుక' అనే మొదటి సంక్షోభం తర్వాత ఇంకేదో అవుతుంది. భావుకత విస్తరించి కొత్తవైయక్తిక అనుభవ ప్రపంచంలోకి అతన్ని తీసుకెళుతుంది. కొత్త దృష్టికోణాలు ఏర్పడతాయి. రచయితగా తను ఇతర జీవితాల్లోకి ప్రవేశించ గలుగుతాడు. దానితో జీవితానికి వెలుపలవుంటూనే జీవితంలో నిమగ్నత సాధిస్తాడు.

బర్జస్ ఒకసారి తన కాలక్షేపంకోసం, తనస్నేహితుల కోసం రచన చేస్తానన్నాడు. ఇది నువ్వు ఎవరికోసం రచన చేస్తావు అన్న ప్రశ్నకి సమాధానం. అలాగే ఒక్కసారి రచయిత రచన చేయటం ఆపి, కార్యరంగంలో దూకాలని సామాజికంగా జరిగే అన్యాయానికి, రచయితగా మనకున్న సామాజిక జ్ఞానానికి మధ్య సంఘర్షణని పరిష్కరించటానికి ఇదొక మార్గమని సార్త్ర్ అంటాడు. అయితే ఇద్దరూ కూడా అస్తిత్వాన్ని పరిశోధించటంలో సాహిత్యానికి పాత్రవుందని అంగీకరించేవారు. బర్జస్ తన రచనల్ని స్నేహితులకోసం మాత్రమే రాయటానికి కారణం ఆయన తన రచనల్ని ప్రచురించాడు. ప్రచురించటమే కాదు, దాని ఫలితాన్ని అనుభవించాడు. అలాగే సార్త్ర్ 1968లో బారికేడ్లమధ్య వుండికూడా రాయటం ఆపలేదు.

తను ఎవరికోసం రాయాలి అన్న ప్రశ్నే రచయితని కలచివేస్తుంది. ముఖ్యంగా ధోరణిలాగా నడిచే రచనలు కీర్తించబడతాయా, దిగజారుడుగా నిందింపబడతాయా అనేది పెద్ద సమస్య అవుతుంది. ఆల్బర్ట్ కాము ఈ సమస్యకి మంచి పరిష్కారం చెప్పాడు. '' ఒక వ్యక్తి మనిషికోసం పూర్తిగా పనిచేయాలి, లేదా వదిలి వేయాలి. మనిషికి ఆహారం, న్యాయం కావాలనుకుంటే, ఈ అవసరాల్ని తీర్చాలనుకుంటే, తాను చేయగలిగిందంతా చేయాలి. అతను మనిషి హృదయానికి ఆహారమైన శుద్ధసౌందర్యంకూడా కావాలనుకునే వ్యక్తిజీవితంలో ధైర్యం, సాహిత్యంలో సామర్థ్యం

కావా''లంటాడు కామూ. 'విప్లవానికి సహకరించే మార్గం వీలున్నంత మంచిగా రచన చేయటమేనంటాడు గాబ్రియల్ గార్షియా మార్క్వెజ్.

రచన చేసేవాళ్ళందరికీ ఈ పైరెండు అభిప్రాయాలు శిరోధార్యాలు. సమకాలీన రచయితలకి ఎదురయ్యే సంఘర్షణలను యివి నివారించజాలవు. సంఘర్షణలు ఎదురవతూనే వుంటాయి పై రెండు అభిప్రాయాలు సమకాలీన సామాజిక సందర్భంలో రచయితకి సుసాధ్యమయ్యే రెండు అంశాలని సూచిస్తాయి.

దేశాల్ని, ప్రజల్ని కాపాడలేని కవిత్వమేమి కవిత్వమన్నాడు చెస్లావ్ మిలాజ్. 'చెట్ల గురించి మాట్లాడటం నేరం' అయిన కాలాన్ని గురించి బ్రెఖ్ట్ చెప్పాడు. మనం అటువంటి నిరుత్సాహపూరితమైన కాలంలో వున్నాం. అటువంటి దేశాల్లో వున్నాం. రచయితల రచనలు సెన్సార్ చేయబడే చోట, అసలు రాయటం నుంచి రచయితలను నిషేధించేచోట, జైళ్ళనుండి ఒకపేపర్ రాసి బయటకు పంపడానికి ప్రాణాలనే ఫణంగా పెట్టాల్సిన చోట, సార్త్ర్ పరిష్కారం అర్థవంతం అనిపించదు. ఈస్థితిలో మనవైఖరి నికాస్ కజాన్‌జాకిస్ మాటల్లో చెబితే భయంగొలిపే మన కాలధ్వనితో సంలీనమవటంగా వుండాలి.

నాదిన్ గోర్డిమర్ 1923 నవంబరు 23వ తేదీన ట్రాన్స్‌వాల్‌లో ఇసిడోర్ గోర్డిమర్, నాన్ (మేయర్స్) గోర్డిమర్లకు జన్మించింది. 1939లో ఆమె 16వ యేట తన మొదటి కథ ''రేపా! మళ్ళీరా''ను ప్రకటించింది. 1949 మార్చి 6న వివాహమైంది. 1950ల్లో ఆమె అనేక కథలను అనేక పత్రికలలో ప్రకటించింది. 1953లో ఆమె మొదటి నవల "The Lying Days" వెలువడింది. ఈమె నవలలను దక్షిణ ఆఫ్రికాలో నిషేధించారు. "A World of Stranger", "The Late Bourgeois World" "Burgers Daughter" అనే నవలలు నిషేధానికి గురయ్యాయి.

వర్ణ వివక్షకు ఆమె వ్యతిరేకి. నల్లవారి విముక్తి ఉద్యమాలను ''నల్లరచయితల''ను ఆమె బలపరిచింది. ఆమె అనేక సాహితీ బహుమతులను గెలుచుకొంది.

ఆల్‌ఫ్రెడ్ నోబెల్ పదాలలో చెప్పాలంటే:

''ఎవరైతే తన బ్రహ్మాండమైన ఐతిహాసిక రాత ద్వారా మానవాళికి ప్రయోజనకారి అయ్యారో ఆమెకు''.

సంపాదకుడు

మనకి తెలుసు మనలో కొంతమంది రచనలు స్వదేశాల్లో నిషేధానికిగురవటంవల్ల చదవకుండా పడివున్నాయి. మనం మాత్రం రాయటాన్ని ఆపలేదు. చాలామంది జైళ్ళలో నిర్బంధించబడ్డారు. ఒక్క ఆఫ్రికానే తీసుకోండి సొయెంకా, గూగి, జాక్ మపానియా, నాస్వదేశం దక్షిణాఫ్రికాలో జరిమికొసిన్, సిరాటి, బ్రేటన్ బ్రేటన్‌బాక్, డెనిస్ బ్రూటస్, జాక్‌సిరాకీ వీళ్ళందరూ కూడా జైళ్ళపాలయ్యారు. కారణం వీళ్ళు వీళ్ళ జీవితాల్లో చూపించిన ధైర్యం, అంతేకాక వీళ్ళు చెట్ల గురించి మాట్లాడే హక్కు ప్రదర్శిస్తున్నారు. థామస్ మాన్ నుండి చినువా అచిబీ వరకు చాలామంది ప్రవాస జీవితపు బీభత్సాల్ని, గాయాల్ని చవిచూశారు. కొంతమంది రచయితలుగా ఆగాయాల్నించి బయటపడలేక పోయారు. కొంతమంది అసలు రచయితలుగా

నిలబడలేకపోయారు. కాన్ తెంబా, అలెక్స్‌లాగామా, నాట్‌నకాసా, టాడ్ మాట్‌షికిజా ఇంకా కొంతమంది రచయితలు గత అర్థశతాబ్దంనుంచి జోసెఫ్ రాత్ నుంచి మిలన్ కుందేరా వరకు తమదికాని పరాయిభాషలో రచనలు చేసుకోవాల్సి వచ్చింది.

1989 నుంచి గతంలో ఎన్నడూలేని బీభత్సకర వాతావరణం మొదలైంది. వాతావరణంలో రచయిత తన వాక్యాన్ని అర్పించాలని ఆజ్ఞలు జారీఅవ్వటం మొదలయ్యాయి. విజ్ఞాన శాస్త్రయుగం నుంచి ఆధునిక యుగం అంతాకూడా రచయితలు అనేక నిందల్ని, నిషేధాల్ని, ప్రవాసాల్ని భరించాల్సి వచ్చింది, 'మదాం బొవరి'లో అశ్లీలం వుందని, ఫ్లాబట్ కోర్టుకు లాగబడ్డాడు. స్ట్రెయిన్డ్‌బెర్గ్ మతాన్ని విమర్శించాడనే సాకుతో శిక్షింపబడ్డాడు. లారెన్స్ 'లేడీ చాటర్లీస్ లవర్' నిషేధింపబడింది. ఇట్లాంటివి అనేకం బూర్జువా నీతిసూత్రాలని ఉల్లంఘించాయనే సాకుతో నిషేధాలకు గురయ్యాయి. ఇటువంటి వాతావరణం ఫ్రాన్స్, స్వీడన్, బ్రిటన్‌లాంటి దేశాలలో లేని స్థితిలో ఒకరచయితకి ఒకమతం మరణదండన విధించింది. మూడు సంవత్సరాలకి పైగా ఫత్వా విధించబడిన సాల్మన్ రష్డీ ఎక్కడ కెళ్ళినా రహస్యంగానే జీవిస్తున్నాడు అతనికెక్కడా ఆశ్రయంలేదు. ప్రతి ఉదయం తానుకూర్చుని రాయటానికి ఉద్యమించిన క్షణం నుంచి తానారోజు బ్రతికివుంటానో లేదో తెలియని స్థితిలో వున్నాడు. తాను రాస్తున్న కాయితం తనదగ్గర మిగులుతుందో లేదోకూడా తెలియదు. సాల్మన్ రష్డీ అద్భుతమైన రచయిత. తనని ఫత్వాకి గురిచేసిన 'ద సాటానిక్ వర్సెస్' అనే నవల మన యుగ అస్తిత్వ అనుభవాన్ని గాఢంగానూ, ప్రయోగాత్మకంగానూ పరిశీలించిన నవల. వలసానంతర ప్రపంచంలో రెండు సంస్కృతుల మధ్య మార్పుకు గురౌతున్న వ్యక్తి మూర్తిమత్వాన్ని ఒకదగ్గరకు చేర్చిన నవల యిది. అతని నవల వాస్తవ పూరాణం. గంటర్‌గ్రాస్ నాజీయుగం తర్వాత తన రచనలు 'ది టిన్‌డ్రమ్', డాగ్ ఇయర్స్' తర్వాత సాధించిన దానినే సాల్మన్ రష్డీ యూరప్‌లో వలసానంతర చైతన్యంలో సాధించాడు. 'వెయిటింగ్ ఫర్ గోదో' బెకెట్‌చేరుకున్న అస్తిత్వ ఆవేదనని కొంత స్థాయీ భేదంతో రష్డీకూడా చేరుకున్నాడు. రచయితగా అతని స్థానమేదయినా తోటి రచయితలకి అతని గురించి పట్టించుకోవాల్సిన అవసరం చాలావుంది. అతని వ్యక్తిగత సమస్యలు ప్రక్కన పెట్టినా వాక్యానికిచ్చిన హెచ్చరికల్ని, దాని పరిణామాల్ని తీవ్రంగా ఆలోచించాల్సివుంది. ముఖ్యంగా ప్రభుత్వాలు ప్రపంచవ్యాప్తంగా పౌరహక్కుల సంస్థలు దీని గురించి పట్టించుకోవాలి. ప్రత్యక్ష నియంతృత్వాలు అంతమయినప్పటికీ గొప్పమతాల పేరుచాటున అంతర్జాతీయ తీవ్రవాదం హత్యాపూర్వకమైన హెచ్చరికలతో ముందుకొస్తున్నాయి. ప్రజాస్వామిక ప్రభుత్వాలు, ఐక్యరాజ్యసమితి దీనిని మానవజాతికి వ్యతిరేకంగా జరిగే నేరంగా పరిగణించాలి.

ఈ శతాబ్దపు ముగింపు దశకంలో మొత్తంగా రచయితల మీద ప్రయోగింపబడిన అణిచివేత గురించి మాట్లాడుకుందాం. అణిచివేత పూర్వక ప్రభుత్వాలు అవి రష్యాబ్లాక్‌లోనా, లాటిన్ అమెరికాలోనా, ఆఫ్రికాలోనా అనేదానితో సంబంధం లేకుండా, బందీలయిన రచయితలందరూ తామున్న సమాజంలో సాధారణ అణచివేతని వ్యతిరేకించే పౌరులుగా కూడా హక్కులేకుండా చేయబడ్డారు.

రచయిత తన శత్రువుని, సాయుధుడయిన తనమిత్రుణ్ణి కూడా పరిశీలించే హక్కు కలిగివుండాలి. కారణం అన్వేషణ మాత్రమే అస్తిత్వానికి అర్థం కల్పిస్తుంది.

# గురుపాదం - వట్టి మట్టికాలే

## (మనోవైజ్ఞానిక విశ్లేషణ)

- అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

నీచే (Nietsze) ఈ ఆధునికశకాన్ని ఒక మంత్రంతో ఆవాహం చేశాడు. ఆమంత్రం ఏమిటంటే ''దేవుడు మరణించాడు'' అని. ఈ మంత్రానికి రెండు అనుబంధ సిద్ధాంతాలు మొలిచాయి. ఒకటి డాస్టోవిస్కీ ప్రతిపాదించింది; ''దేవుడు మరణించాడు కనుక ప్రతిదీ అనుమతించబడుతుంది,'' అనేది ఆసిద్ధాంతం. అంటే ఎవరు ఏమైన చేయవచ్చు. దేవుడు లేడుకనుక ఎవరికీ భయపడవలసిన పని లేదు. రెండో అనుబంధ సిద్ధాంతాన్ని జాక్ లెకాన్ (Jacques Lacan) అనే ఫ్రెంచ్ మనో వైజ్ఞానిక శాస్త్రవేత్త ప్రతిపాదించాడు. ఇతడూ ఒక గురువే; ''దేవుడు మరణించాడు కనుక ఏదీ అనుమతించబడదు,'' అంటాడు ఈయన. దేవుడు లేనప్పుడు మానవుడు మరింత బాధ్యతతో ప్రవర్తించాలి కనుక ఎవరు ఏవిధంగాను అతిచరించకూడదు.

ఆంతోని స్టోర్ అనే ప్రసిద్ధ మనో విజ్ఞాన శాస్త్రవేత్త "Feet of Clay': A Study of Gurus (''మట్టిపాదం; గురువుల అధ్యయనం'') అనే గ్రంథాన్ని రాశాడు. దీనిని మనం ''గురుపాదం: వట్టి మట్టికాలే'' అని చెప్పుకోవచ్చు. ఈ గ్రంథంలో అతడు పైరెండు సిద్ధాంతాలమధ్య, వస్తుగత, ఆత్మగత విషయాల మధ్య, విశ్వాసం - భ్రమల మధ్య, పిచ్చి - మంచిల మధ్య, క్రమత - గందరగోళాల మధ్య సరిహద్దు రేఖను గీయాలని ప్రయత్నించాడు. దేవుడు లేని మనోవిదళిత (Scizophrenic) ప్రపంచం ఒత్తిడులకు లోనైన కొంత మందికి ఈ సరిహద్దు రేఖ చెరిగిపోయినట్లనిపించింది. మరి కొంత మంది అయితే ఈ చెరిపివేతకు ముగ్ధులయ్యారు. ఫలితంగా ''ప్రతిదీ అనుమతించ బడుతుంది'' నుంచి ''ఏదీ అనుమతించబడదు'' వరకూ మధ్య అటు ఇటూ ఊగిసలాడింది ప్రపంచం. ఇటు వంటి ప్రపంచానికి గురువు ఒక ప్రతీక అయ్యాడు - అటు వంటి ఆత్మగతమైన ప్రపంచానికి, దేవుడులేని దివ్యత్వ ప్రపంచానికి ప్రతీక అయ్యాడు. అంతే కాదు, అదేసమయంలో ఆ గురువు ప్రపంచానికి పట్టిన పీడ (రోగం) కు రోగలక్షణం (Symptom) అయ్యాడు; అటు వంటి దేవరాహిత్యతా వ్యాధికి లక్షణం, గుర్తు అయ్యాడు.

ఇటు వంటి రోగగ్రస్త ప్రపంచం గురువును ఆశ్రయించక తప్పలేదు. అందుకే నేడు జనం గుంపులు గుంపులుగా గురువుల వెంట బాబాల వెంట పడుతున్నారు. పరుగులు తీస్తున్నారు. గుర్జియఫ్ (Gurdjieff), డేవిడ్ కొరేష్(David Koresh), ఆచార్య రజనీష్(Rejaneesh), జిమ్ జోన్స్ (Jim Jones), చంద్రస్వామి ఎందరో మరెందరో గురువులున్నారు. ఈ గురువులు ఇటువంటి వ్యాధి గ్రస్త ప్రపంచం నుంచి అనన్యమైన, అసాధారణమైన, తిరుగులేని విధేయతను శిష్యగణం నుంచి, భక్తకోటి నుంచి పొందుతున్నారు. గురువులు ఏమి చెబితే అది, అది ఎంతటి దారుణమైనదైనా చేయడానికి భక్తులు సిద్ధమవుతున్నారు. ఏ గురువు కాగురువు తనభక్త కోటితో తనదైన ప్రత్యేకశైలిలో తన రాజ్యాన్ని నిర్మించు కొంటున్నాడు. ఈ రాజ్యానికి కట్టు దిట్టమైన ''కంచె'' వేసి బాహ్యప్రపంచంతో భక్తులను కలవనీయడు. ఇటువంటి బుల్లి బుల్లి రాజ్యాలలో సముదాయాలలో విశృంఖల లైంగికతకు, నేరాలకు, మాదక ద్రవ్యాలకు కొదువలేదు. వీరు ప్రతి

మానసిక రోగాన్ని ఒక అధిభౌతిక జ్ఞానం (Transcendental Wisdom)గా చిత్రిస్తారు. గురువుకు శిష్యుడు పరిపూర్ణ వశవర్తి అవుతాడు. గురువుకు అనంత, అతీంద్రియశక్తులు జ్ఞానం ఉన్నట్లు ప్రచారమవుతుంది. ఈ లక్షణాలన్నీ ఈ ఆధునిక గురువుల సామ్రాజ్యాలకు పరిపాటి అయ్యాయి. అయితే మనం ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి: పూర్వం నుంచి సాంప్రదాయికంగా, ఆధ్యాత్మికంగా వస్తున్న గురు పరంపరకు ఈ ఆధునిక రోగ లక్షణాలను ఆపాదించలేము. వారు తమ శిష్యగణం భక్తి ప్రపత్తులను కాక వారి ఉన్నతిని ఎదుగుదలను, స్వేచ్ఛను కోరుకొన్నారు.

ఆధునిక నాగరికత గురువును ఒక దేవదూతగా పరివర్తించింది ఒక నూతన సత్యాన్ని ఆవిష్కరించిన వారి విషయంలో ఇలా జరిగితే మంచిదే. కాని అటువంటి నూతన సత్యాన్ని దేనినీ ఆవిష్కరించకుండానే, హిందుమతంలోని ఏవో కొన్ని విషయాలను వల్లించి, వాటిని తన నూతన సిద్ధాంతాలుగా పేర్కొని, తన పబ్బం గడుపుకోవడానికి ఇంతచేసిన చంద్రస్వామిని గురువును చేసింది ప్రపంచం. ఇదే ఆశ్చర్యం. ఇలా ఎందుకు జరిగింది?

ఆధునిక ప్రపంచంలో భరించరాని శూన్యత, నైరాశ్యత పేరుకు పోయాయి ''జీవితం అర్థరహితం, నిరర్థకం'' అనే సమస్య బృహత్ప్రమాణంలో పెరిగి మనిషిలో భయానకతను పెంచింది. ఈ సమస్యను ఎదుర్కోవడానికి ఆధునిక ప్రపంచానికి అందుబాటులో ఉన్న సాధనాలు డబ్బు, లైంగికత, దూరదర్శన్‌లు. కాని ఇవి సమస్యను పరిష్కరించ లేవని తేలిపోయింది. దీనితో సామాన్య జనానికి దిక్కు తోచకుండా పోయింది. ఈ విధంగా ఆధునిక మానవుడు శంక, గందరగోళం, అనిశ్చితతలలో పడిపోయాడు. ఈ విధంగా '' ఆత్మ విశ్వాసలేమి''లో ఆత్మశంక (Self doubt) లో, హృదయవిదారక మహాసాగర ప్రమాణ అనిశ్చితతలో పడిపోయిన ఆధునిక మానవునికి గురువు ఆత్మ విశ్వాసానికి, నిశ్చితత్వానికి ప్రతీకగా మూలస్తంభంగా కనిపిస్తాడు. ఇలా రోగ గ్రస్తుడైన, భ్రాంతుడైన మానవునికి గురువు మరింక ఎలాకనిపిస్తాడు?

ఈ గురువులందరికి కొన్ని ముఖ్యసామాన్య లక్షణాలున్నాయి. ఈ ప్రపంచాన్ని తామర్థం చేసుకొన్నంతగా మరెవరూ అర్థంచేసుకోలేదన్న మహామూఢ విశ్వాసం వీరిసొత్తు మహావిశ్వాసం అల్పవిశ్వాసాన్ని ఆకర్షించినట్లు, ఈ గురువులు శిష్యులను - ముఖ్యంగా డబ్బున్న వాళ్ళను, పలుకు బడి ఉన్నవాళ్ళను, అంతస్తు ఉన్నవాళ్ళను, వీలైతే అందమైన ఆడవాళ్ళను - ఆకర్షించి తమ ఆరామాలను ఏర్పాటు చేసుకొంటారు. ఈ భక్తగణం ప్రాణాల మీద సైతం వీరికి అధికారం ఉంటుంది. జిమ్ జోన్స్, గుర్జీజియఫ్, రజినీష్, డేవిడ్ కొరేష్‌లు తమ రోగగ్రస్త అభిరుచులకు పరపీడన కామం (Sadism) నుంచి పిల్లల మీద లైంగిక అత్యాచారం వరకు - అభివ్యక్తి కల్పించుకొన్నారు. రోగవాంఛలకు తృప్తి కల్పించు కొన్నారు. గయానా జోన్స్ టవున్‌లో జిమ్ జోన్స్ స్థాపించిన సామ్రాజ్యంలో భక్తులను గురిచేసిన హింసలు వర్ణించరానివి ఇతని ఆదేశంపై 900 మంది సైనైడ్ తీసుకొని ఏకకాలంలో మరణించారు. బట్టల్లో మల విసర్జనం చేసుకొన్న ఒక బాలుని, ఆ బట్టలను అలాగే తలపై కప్పుకోవలసిందిగా ఆదేశించారు. ఆ పిల్లవాణ్ణి ఆకలితో మాడ్చారు. ఇతరులు భోజనం చేస్తున్నప్పుడు, ఆకలితో ఉన్న ఆ బాలుడు, చూస్తూ నిలబడాలి. కొన్ని సార్లయితే పిల్లల్ని బావిలో విసరివేసే వారు. బావిలో అంతకు ముందే సిద్ధంగా ఉన్న కొందరు, ఈ పిల్లల్ని నీళ్ళల్లో ముంచే వారు. అమెరికా ఓరగాన్‌లో రజనీష్ ఆశ్రమంలో ఫోన్‌టాపింగ్ ఉండేది. భక్తులను మాదక ద్రవ్యాలతో మత్తులో ఉంచేవారు ఎవరూ ఎదురు

తిరగకుండా. రజనీష్ పూనా ఆశ్రమంలో లైంగిక విశృంఖలత ఇబ్బడి ముబ్బడిగా ఉండేది. ఈ సంగతి అందరికి తెలుసు, ఇవన్నీ భక్తుల పారవశ్యామోదంతోనే జరిగేవి.

ఇటువంటి పట్టు గురువులకు భక్తబృందంపై ఎలా వచ్చింది? ఫ్రాయిడ్ మతంలో దీనిని ఇలా వివరించవచ్చు:

ప్రతి శిష్యుడు లేదా భక్తుడు తన అహం (ego) మొత్తాన్నిగాని, అందులో భాగాన్ని కాని గురువు లేదా నాయకుని అహానికి అర్పిస్తాడు. ఎందుకంటె శిష్యుని దృష్టిలో గురువు ఒక ఆదర్శపురుషుడు, దైవసమానుడు, అధిభౌతిక అహం (Transcendental ego) అవుతాడు. చాల చాల మతాలలో దేవుడు తాను సృజించిన ప్రకృతి నియమాలకు బద్ధుడవుతాడు. అతణ్ణి ఆవాహంచేసినప్పుడు అతడు ప్రాథమిక మానవ వాస్తకవికతలలో దర్శనమిస్తాడు ఐన్‌స్టైన్ చెప్పినటు దేవుడు ఈ ప్రపంచంతో పాచికలాడడు. కాని ప్రతి గురువు పాచికలే ఆడతాడు. మహావిశ్వాసాన్ని కూరి వారు నిర్మించే భ్రామిక వ్యవస్థ తరచు నియతి నియమాలకు కట్టుబడి ఉండదు. స్వైరకల్పన దాని భూమిక. మనం నివసించే ఆధునిక హేతుబద్ధ ప్రపంచ జీవితావసరాలను అది తీర్చలేదు. అందుకనే గురువులు ''కంచె'' వేసుకొని, ఆకంచె లోపలే భక్తగణాన్ని కట్టివేసి, బాహ్యప్రపంచంతో వారికి సంబంధాలను తెంపివేస్తారు. కొద్ది కాలంలోనే ఈ సముదాయాలు నియంతృత్వ రాజ్యాల పోకడలు సంతరించుకొని భక్తుని జీవితంలో అధిక భాగాన్ని లేదా అతని అస్తిత్వాన్నే త్యాగం చేయమంటాయి. ఆ సముదాయం విడిపోకుండా ఒకటిగా ఎలా మనగలుగుతుంది? మాదకద్రవ్యాలు, లైంగికార్షణలు ఈ సముదాయాలలో ఉన్నా వీటి కంటె మంచి బలమైన మత్తుమందు మరొకటి ఉంది. అది శిష్యులను ఉత్తేజపరిచే గురువు గురుత్వాకర్షణ వ్యక్తిత్వం (Charisma). ఇదేకాకుండా ఈ మందులో మరో భాగం శిష్యుడు తన అల్పత్వం మీద జీవిత నిరర్థకత మీద ఏదో విజయాన్ని సాధించాననే అనుభూతికి లోనుకావడం. అంతేకాదు, గురువులు శిష్యుని చుట్టూ ''కంచె'' వేస్తారు. ఈ కంచెలో ఇరుక్కుపోయిన ఆధునికుడు తన భ్రష్టప్రాముఖ్యాన్ని పొందిన, తను సాదాసీదా మనుషుల ప్రపంచంలో లుప్తమై పోకుండ ప్రముఖుడై నిలబడ్డ అనుభూతిలో మునిగి పోతాడు. తన ముఠా గెలిచినప్పుడు ఒక రౌడీ పొందే ఆనందం లాటిదేదో ఈ అనుభూతిలో ఉంటుంది. ఈ అనుభూతితో ఛాతీ వెడల్పు అయి, అహం ఉల్లాస ప్రమాణాలలో పెరుగుతుంది. ఈ పెరగడాన్ని అతడు నిజమైన 'సాకూతత'గా, అర్థవతత్త్వంగా పరిగణిస్తాడు. ''నేను ఎట్టకేలకు ఒకలోతైన గాఢమైన జీవితార్థాన్ని గ్రహించగలిగాను.'' అనే విజయగర్వంతో ఊగిపోతాడు.

ఆధునిక ప్రపంచంలోని శూన్యత, నిరర్థకత, అర్థరాహిత్యాలను గురువు సాధారణ స్థాయిలో ఎదుర్కోవడంపై అతని విజయం ఆధారపడి ఉంటుంది. దేవుడు లేని ఈ ప్రపంచంలో అర్థాన్ని వెతుక్కోవడం అనేది విజ్ఞానశాస్త్రం, కళ, సాహిత్యం, రాజకీయాలు, ఇంకా సంప్రదాయక మతాల ప్రతీకాత్మక చర్య (Symbolic activity)ల ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. మరి ఇవేమో జనసామాన్యంలో ఏ కొద్దిమంది అదృష్టవంతులకో, ప్రతిభావంతులకో మాత్రమే అందుబాటులో ఉంటాయి. మానవ వాత్సల్యం, సంబంధాలు, మానవతా కార్యకలాపాల మీద అధిక సంఖ్యాకులు తమ జీవిత సాఫల్యం కోసం ఎదురు చూస్తున్నారు. వీటి ద్వారా కొంత సాఫల్యం సాధించినా, అట్టడుగున మౌలిక అసంతృప్తిలో కొంత భాగం అలాగే మిగిలిపోతుంది. ఫ్రాయిడ్ చెప్పిన ఉదాత్తీకరణం (Sublimation) ద్వారా గూడ ఈ శేషభాగం అభివ్యక్తి పొందదు.

దీనికి సహజమైన అభివ్యక్తి మార్గం కానరాని కారణాన పరా-మతానుభవాల (Para - religious experiences) ద్వారా ఇది బహిర్గతమవుతుంది. వస్తుగత అర్థం దొరకనందున గురువు చిత్తభ్రమ (Delirium) స్వభావి అయిన ఆత్మగతార్థాన్ని ఎంచుకొని, దానిని శిష్యులకు ఎక్కిస్తాడు. దానితో శిష్యులు అదే చిత్తభ్రమలో పడిపోతారు.

ఈవిధంగా ఆధునిక నాగరికత ఈనుతున్న రాశిమ్యార్ సిస్ (Mass Hysetrian)ను గురువు తన ''పిచ్చిమూర్తి'' (insane Person) చుట్టూ పోగుచేసుకొంటున్నాడు. మనం ఒక విజ్ఞాన శాస్త్రవేత్తను, కళాకారుని ప్రశ్నించ గలం గాని, గురువుని ప్రశ్నించలేం. కళా, శాస్త్రాలు ప్రపంచంలో ఉంటాయి. కాని గురువులు తాము సృష్టించుకొన్న సమాజాలలో నివసిస్తారు. ఈ సమాజాలు, గురువులు భ్రమ పూరిత ఆత్మలకు విస్తృతీకృత రూపాలు మాత్రమే. ఆ భ్రమ ఏదంటే గురువులు తాము ఏదో గొప్ప.వారమని, వైభవో పేతులమని భావిస్తారు. ఇదీ గురుపాదం సంగతి.

*Feet of Clay:* A Study of Gurus
by Anthony Storr Harper collins
£ 18

---

# HOW HENRY HIGGINS WOULD HAVE FELT ABOUT THE NINETIES WOMEN

Remember Henry Higgins in that memorable Sixties movie "My Fair Lady", tearing his hair out by the roots and raging like a caged tiger (not, perhaps, a particularly savoury comparison these days) about how "women are irrational/that's all there is to that!/Their heads are full of cotton, hay and rags!/They're nothing but exasperating, irritating/vacillating, calculating, agitating,/ maddening and infuriating hags!"?

Well, how do you think he would have felt about the Nineties' woman had he been around now, grown older and greyer and comfortably accustomed to a life with Eliza and his slippers? He couldn't get more valuble than that, surely. Perhaps he would have dispensed with the cotton, hay and rags bit - he wouldn't have had a choice - but as for the rest, the Nineties' woman could't get more full of contradictions that what she is today.

# SUPER POWERS OF SEXUAL PROWESS

America and Russia are the world's sexual superpowers, with their people enjoying intercourse more than twice as often as the low - libido Spanish.

But Canadians, Mexicans and Britons are the most considerate lovers, the survey conducted by London International Group, makers of Durex condoms, said.

The survey, which questioned 10,000 sexually active adults in 15 countries about their sex lives, found that on average, they made love 109 times a year, or once every 3.3 days.

But the average for Russians was 135 times and for Americans 133, while at the bottom of the table, Thais had intercourse 71 times a year and Spaniards 64 times.

People in Thailand, France and Australia practise safest sex, it said. Unprotected sex was most frequent in Poland, Canada and Hongkong, according to the survey.

# ఠుమ్రీ

– యస్. సదాశివ

ధ్రుపద్, ధమార్, ఖయాల్లు శాస్త్రీయ సంగీతానికి; ఠుమ్రి, దాద్రా, ఠుప్పా, గజల్, భజనలు ఉపశాస్త్రీయ సంగీతానికి చెందినవి. చైతీ, కజరీ, సావనీ, హోరీలు లోకగీత్‌లు. అంటే, జానపదులపాటలు - కొన్నాళ్ల క్రిందటి వరకు శాస్త్రీయ సంగీతం పాడే గాయకులు కొందరు ఠుమ్రి, దాద్రాలను పాడేవాళ్లు కారు. పాడక పోవటానికి ఒక కారణం, అవి ఉపశాస్త్రీయ సంగీతానికి చెందినవి గనుక శాస్త్రీయ గాయకుల స్థాయికి తగినవి కావనేభావం. ఇంకొక కారణం, ఠుమ్రీ దాద్రాల బందిష్‌లు శృంగార రస ప్రధానమైనవి కనుక వాటిలో అశ్లీలతా స్పర్శ వుంటుందనే భావం. కాబట్టి ఉపశాస్త్రీయ సంగీత శాఖ తవాయఫుల కోసం వదిలి పెట్టబడింది. తవాయఫుల గురించి గజల్ల సందర్భంలో రాసివున్నాను కనుక మళ్లీ రాయటం అనవసరమనుకుంటాను. గ్వాలియర్ ఘరానా నాయకులు ఠుమ్రీలు పాడే వాళ్లు కారు గాని భజనలు పాడేవాళ్లు. భజనలు కూడా ఉపశాస్త్రీయ సంగీతానికి చెందినవే. అంటే, గ్వాలియర్ గాయకులు ఉపశాస్త్రీయ సంగీతం పట్ల తేలిక భావం కలవాళ్లు కారు గాని, శృంగార రస ప్రధానమైన సంగీతాన్ని సభ్య సమాజం ముందు పాడటానికి సంకోచించేవాళ్లను కోవాలి. శాస్త్రీయ సంగీతాన్ని రాజ దర్బారుల్లోంచి ప్రజల మధ్యకు తెచ్చిన ఘనత పలుస్కర్‌ది. అతని పూర్తిపేరు విష్ణుదిగంబర్ పలుస్కర్. గాంధర్వ మహా విద్యాలయాలు స్థాపించిన వాడతడే. అతడు పాడిన మీరా, తులసీ, సూర్‌దాస్ భజనలు గాంధీజీకి చాల ప్రియమైనవి. ముఖ్యంగా రఘుపతి రాఘవరాజారామ్ అనే రామధున్ - వి.డి.పలుస్కర్ కొడుకు డి.వి.పలుస్కర్ కూడ అనేక భజనలు గానం చేసినాడు. సంగీత భాస్కరుడని సన్నుతింపబడిన వి.డి.పలుస్కర్ గురువు గాయనాచార్య బాలకృష్ణబువా ఇచల్ కరంజీకర్ తన పాటకచేరీని రామగీత గోవిందంలోని ఏదో వొక అష్టపదితో ముగించే వాడు కాని జయదేవ కృతమైన గీతగోవిందంలోని అష్టపదులు పాడేవాడుకాదు. వాటిలో రాధాకృష్ణుల ప్రణయ శృంగార చిత్రణ అసభ్యంగా, అశ్లీలంగా జరిగిందని అతని అభిప్రాయం.

చిత్రమేమంటే ఠుమ్రీ సంపూర్ణ వికాసం చెందింది గ్వాలియర్ ఘరానాలోనే. కిరాణా ఘరానాకు చెందిన ఉస్తాద్ అబ్దుల్ కరీం ఖాన్ ఠుమ్రీలే కాక మరాఠీ నాట్యగీతాలు కూడ గానం చేసేవాడు. ఆగ్రా ఘరానాకు చెందిన ఉస్తాద్ ఫయ్యాజ్‌ఖాన్, పట్యాలా ఘరానాకు చెందిన ఉస్తాద్ బడేగులామలాఖాన్, అతని తమ్ముడు ఉస్తాద్ బర్కతలీఖాన్ పాడిన ఠుమ్రీలు చిరస్మరణీయమైనవి. ఇంత గొప్ప గాయకులు ఆసక్తితో ఠుమ్రీలు పాడినారంటే అవి అశ్లీలమైనవి కావనే గదా వాళ్ల అభిప్రాయం! నిజానికి అవి అశ్లీలమైనవి కావు. కనుకనే ఒక నాడు తవాయఫులు మాత్రమే పాడే ఠుమ్రీలను ఇటీవలి కాలంలో కులీన కుటుంబాల మహిళలు సైతం పాడుతున్నారు. కులీన కుటుంబానికి చెందిన రీటా గంగూలీ స్వదేశీసంస్థానాలు అంతరించిన తర్వాత నిరాశ్రతలైన తవాయఫుల సహకారంతో ఉపశాస్త్రీయ సంగీతం నేర్పించే విద్యాలయాన్ని నిర్వహించింది. ఆమె స్వయంగా మంచి గాయకురాలు.

పాత తరం ఠుమ్రీ దాద్రా గాయనంలో ప్రఖ్యాతి గాంచిన వాళ్లు హైదర్‌జాన్, మలికాజాన్, గోహర్‌జాన్, వహీదన్‌బాయి, జద్దన్ బాయి (నర్గిస్ తల్లి) జానకీ బాయి, కాశీబాయి, బడామోతీబాయి, విద్యాధరీదేవి, రసూలన్ బాయి, సిద్ధేశ్వరీదేవి, అఖ్తరీబాయి, హీరాబాయి

---

★ **శ్రీ యస్. సదాశివ**గారు ప్రభుత్వ కళాశాలల్లో అనేక చోట్ల ప్రిన్సిపాల్‌గా పనిచేసి, రిటైరై ప్రస్తుతం ఆదిలాబాద్‌లో ఉంటున్నారు.

బరోడేకర్, రోషనారా బేగం మొదలయిన వాళ్ళు బనారస్ ఘరానాకు చెందిన పాత తరం గిరిజాదేవి ఈ వయసులోనూ పాడుతున్నది. ఆమె శిష్యురాండ్రు పాడుతున్నారు రెండు మూడేళ్ల క్రిందట మరణించిన హీరాదేవి మిశ్రా, ఇటీవల మరణించిన నిర్మలా అరుణ్(గోవిందా తల్లి) పాడిన ఠుమ్రీలు ప్రసిద్ధమైనవి. లక్ష్మీశంకర్ నిర్మలాదేవి కలిసి పాడిన ఠుమ్రీలు మధురమైనవి. నేటి తరంలో సిద్ధేశ్వరీదేవి కూతురు సవితాదేవి, బీణాపాణి మిశ్రా, రీటా గంగూలీ, పర్వీన్ సుల్తానా, ప్రభా అత్రే, శోభాగుర్టూ ఠుమ్రీదాద్రాలను చక్కగా పాడుతున్నారు. పట్యాలా ఘరానాకు చెందిన ఉస్తాద్ మునవ్వరలీఖాన్ ( ఉస్తాద్ బడే గులామీలాఖాన్ కొడుకు) ఉస్తాద్ నజాకతలీ, ఉస్తాద్ సలామ తలీల జంట, ఇప్పుడు లేరు కాని వాళ్లు పాడిన ఠుమ్రీలు చిరకాలం వుండేవే. కత్థక్ నృత్యం చేసేవాళ్లు ఠుమ్రీలు పాడగలిగి వుండాలె. నేటి కత్థక్ నాట్యా చార్యుడు బిర్జూ మహారాజ్ మంచి ఠుమ్రీ గాయకుడు.

ఠుమ్రీగాయన శైలి కత్థక్ నృత్యం కారణంగానే రూపొందింది. ఠుమక్ అంటే నృత్యంలో ఒక రకమైన ఆంగికాభినయం. 'ఠుమక్‌రీ' అనే మాటే ఠుమ్రీగా మారిందంటారు. లఖ్నో చివరి నవాబు వాజిదలీషా సంగీత సాహిత్య నృత్య రసికుడు. కవి, గాయకుడు, నర్తకుడు. అతని ఆస్థానాన్ని ఆశ్రయించి ఎందరో కవులు, గాయకులు, నర్తకులు, తవాయఫులు వుండే వాళ్లు. పూర్వులార్జించిన అపార సంపదను తన వినోదాలకు, విలాసాలకు కర్చుచేసే వాడతడు. అతని ఆస్థానంలోని కత్థక్ నర్తకులు అష్టవిధ శృంగార నాయికల హావభావాలను ఆంగికాభినయంతో ప్రదర్శిస్తే గాయనీగాయకులు స్వరాభినయంతో వ్యక్తం చేసేవాళ్లు. అలా యేర్పడిన గాయన శైలికే ఠుమ్రీ అనే పేరు కలిగింది. ఠుమ్రీల బందిషులు కొన్ని వాజిదలీషా ''అఖ్తర్‌పియా'' ముద్రతో రచించినాడు. ''బాబుల్‌మొరానైహర్ ఛూటోహిజాయె.'' అనే అతని ప్రఖ్యాత ఠుమ్రీని కె. ఎల్. సైగల్ పాడినాడు. ఇంకెందరో గాయనీగాయకులు పాడినారు.

కత్థక్‌నృత్యంలో ముడివడి లఖ్నోలో రూపొందిన ఠుమ్రీ బనారస్‌చేరి నృత్యాన్ని సడలించుకొని ద్రుతలయలోంచి విలంబిత్ లయలో వికాసం పొందింది. అలా వికసింప జేసిన గాయకుడు భయ్యాగణపత్‌రావు. అతడు గ్వాలియర్ రాజకుమారుడు. మాధవరావు సింధియా సోదరుడు. ( ఇప్పటి మాధవరావు సింధియా తాత. ), స్వరాహతుడు కనుక సామ్రాజ్య సుఖాలను పరిత్యజించి సంగీతం వెంటపడ్డాడు. శాస్త్రీయ గాయనంలోను, ఠుమ్రీ గాయనంలోను సమర్థులయిన ఉస్తాదుల సన్నిధిలో శిక్షణ పొంది హార్మోనియం వాదనలో అద్వితీయ ప్రావీణ్యం సంపాదించుకున్నాడు. ఎన్నో సంస్థానాలు తిరిగి బనారస్‌లో చాలాకాలం వున్నాడు. బనారస్ ఆకాలంలో సంగీత నిలయం. ప్రసిద్ధులయిన ఎందరో గాయనీ గాయకులు ఆనగరాన్నే ఆశ్రయించినారు. అక్కడి సంపన్నులు సంగీత రసికులు. అక్కడే మొయిజొద్దీన్ ఖాన్ అనే యువగాయకుడు భయ్యాగణపత్‌రావు శిష్యుడైనాడు. దైవ దత్తమైన గంధర్వ గాత్రం గల అద్భుత ప్రతిభాశాలి ఆయువకుడు. భయ్యాగణపత్ రావంతటి గురువు లభించటం అతని భాగ్యవిశేషం. అప్పటికే లబ్ధప్రతిష్ఠులైన బాయిజీలు (తవాయఫులు) ఆగురు శిష్యులను ఆశ్రయించి క్రొత్త క్రొత్త బందిష్‌లు నేర్చుకున్నారు. తమ గాయన శైలిలో నూతన అందాలు సమకూర్చుకున్నారు. మలికాజాన్, గోహర్‌జాన్, జోహరాబాయి లాంటి వాళ్లు భయ్యాగణపత్ రావును తమ గురువుగా భావించినారు బడీమోతీబాయి, కలకత్తాకు చెందిన గిరిజాశంకర్ చక్రవర్తి, ప్యారేసాహెబు మొయిజొద్దీన్ ఖాన్ శిష్యరికం చేసినారు. భయ్యాజీ కొన్నాళ్లు కలకత్తాలోనూ వున్నాడు. అక్కడి సంపన్నులతని అభిమానులు.

లఖ్నోఠుమ్రీ బనారస్‌లో శైలి మార్చుకున్నది. రెండూ పూర్వాంగశైలివి. ఉత్తర ప్రదేశ్, బీహార్ ప్రాంతాల లోక్ సంగీతం, చైతీ, కజరీలు పూర్వాంగశైలి ఠుమ్రీలలో చేరి పోయినవి. పంజాబ్ ఠుమ్రీలలో అక్కడి పహాడీధున్, మహ్వా నామకలోక సంగీత శైలి కలిసిపోయింది. పంజాబ్ ఠుమ్రీలను పశ్చిమాంగ ఠుమ్రీలంటారు. ఉస్తాద్ బడే గులామలీఖాన్ పశ్చిమ శైలిని, పూరబీశైలిని కలిపి ఠుమ్రీలుపాడేవాడు. లఖ్నో, బనారస్, పంజాబ్ ఠుమ్రీలలో బనారస్ ఠుమ్రీలే సుందరమైనవని అభిజ్ఞుల అభిప్రాయం. గయాశైలి ఒకటుండేది కాని అదంతగా పేరుపొందలేదు

గోస్వామి సుధాధర్ దేవ్‌శర్మ బహుకాలపరిశ్రమ ఫలితంగా సంగీతశాస్త్ర సంబంధిత గ్రంథాలు రెండు రచించినాడు. ఆనాటి ప్రఖ్యాత గాయనీమణులతో చర్చలు జరిపి ఆ చర్చల సారాంశాన్ని తన గ్రంథాల్లో పొందుపరచినాడు. అతని గ్రంథాల్లో మొదటిది ''వారవధూవివేచన్'', రెండవది ''గానా ఔరనాచ్''. అప్పటి సుప్రసిద్ధగాయని గోహర్ జాన్‌తో అతడు ఠుమ్రీ గురించి జరిపిన చర్చల సారాంశం (వారవధూవివేచన్) తెలుసుకోదగినవి. అంతకంటె ముందు గోహర్ జాన్ గురించి తెలుసుకోవటం అవసరమే.

ఆజమ్ గఢ్‌లో వుండే మలికాజాన్ తన కళకు, ఎదుగుతున్న తన కూతురు గోహర్ జాన్ కళకు తగిన ఆదరణ బనారస్‌లోనే లభిస్తుందనే నమ్మకంతో బనారస్‌కు మకాం మార్చింది. భయ్యా గణపత్‌రావు, అతని శిష్యుడు మొయిజుద్దీన్ ఖాన్ ఠుమ్రీగాయనంలో ప్రవేశపెట్టిన క్రొత్త శైలివలన ప్రభావితురాలై ఠుమక్ (నాట్యపుకులుకు)ను దూరంగా నిలిపి శృంగార నాయిక హావభావాలను గాయనం ద్వారా వ్యక్తం చేసే కళలో ప్రావీణ్యం సాధించింది. ఏ శబ్దాని కెంతటి మహత్వమియ్యాలో ఏ శబ్దాన్ని పలుకటానికి ఏయే స్వరాలనెలా పలికించాలో, ఎక్కడ యేలాటి తాన్‌వేయాలో బాగా అధ్యయనం చేసింది. ఆమె ఆంగ్లో - ఆర్మేనియన్. అసలు పేరు విక్టోరియా. ఒక ముస్లిమ్ యువకుని ప్రేమలో పడి, ఇస్లాంమతం స్వీకరించి, మలికాజాన్‌గా పేరు మార్చుకున్నది. ఆమె కూతురు గోహర్‌జాన్ అసమాన రూపవతి. అనేక భాషల్లో పాండిత్యం సంపాదించుకున్న విద్యావతి. సమస్త కళల్లో ప్రవీణురాలైన కళావతి. సంస్కారసంపన్నురాలు. మృదుభాషిణి. ఖయల్, ఠుమ్రీ, గజల్‌గాయనంలో ఆమె కామేసాటి. ఆమె సంపూర్ణ పరిచయం ఈ వ్యాసంలో సాధ్యపడదు. ఇక్కడదంతా అవసరమూ కాదు. గోస్వామి ఎలాగో ఆమెతో చర్చించే అవకాశం పొందగలిగినాడు. రెండుసార్లు ఆమెతో చర్చించ గలిగినాడు అప్పుడతని వయసు ముప్పయ్యేళ్లు. ఆమె యాభై దాటింది. ప్రాతః కాలమే సమయం కేటాయించేదామె. ఆచర్చ మధ్యాహ్నం వరకు

రెండు మూడు ప్రశ్నల్లోనే అతని సంగీత పరిచయ మేపాటిదో గ్రహించిందామె ఆమె శాస్త్రపరిచయ మెంత విస్తృత మయిందో, ఎంత గంభీర మయిందో గ్రహించిన తర్వాత తాను ప్రశ్నించటం కంటె ఆమె చెప్పేది వినటమే శ్రేయస్కరమనుకున్నాడు గోస్వామి. ఠుమ్రీ చర్చమొదలయింది. ఆమె చెప్పసాగింది. ఠుమ్రీ ప్రసక్తి మూడు వందల సంవత్సరాల క్రిందటి సంగీత గ్రంథాల్లో వున్నది. శార్ఙ్గదేవుడు రచించిన సంగీత రత్నాకరంలోనూ వున్నది. తుంబురుడనే గంధర్వుడు నృత్యసంగీతాల్లో నిపుణుడు. సామవేదంలోని కాథుమ్ శాఖకు చెందిన గాయనశైలి అతనిది. విశిష్టమైన అతని అభినయాత్మకగాయనశైలిని కౌథుమరీశైలి అన్నారు. అదే ఉచ్చారణలో మార్పుచెంది ఠుమ్రీ అయింది, లేదా, తుంబురుశైలీ ఠుమ్రీగా ఉచ్చరించబడివుంటుంది.

కొందరి మతం ప్రకారం గ్వాలియర్ పాలకుడు రాజామాన్‌సింగ్ తొమార్ ఎంత ప్రసిద్ధ

సంగీత శాస్త్ర వేత్తో చరిత్ర చెప్తున్నది. తాన్‌సేన్ అతని సంగీత విద్యాలయంలో ధ్రుపద్ ధమార్‌ల శిక్షణ పొందిన వాడే. మాన్‌సింగ్ తొమార్‌ను కొందరు మాన్‌సింగ్ తంవార్ అనికూడా అంటారు. అతని గుజ్రీ ప్రేయసి మృగనయని పేరున నాలుగు ప్రసిద్ధ రాగాలు సృష్టించినాడతడు (గుజరీ తోడీ అతని సృష్టే) అలాగే తనపేర 'తంకరీ' రాగాన్ని తయారుచేసుకున్నాడు. అదే ఉచ్చారణలో మార్పుచెంది ఠుమ్రీ అయింది. అతని 'మాన్ కుతూహల్' అనే సంగీతశాస్త్రం అలభ్యం. కాని దానిఫారసీ అనువాదం ''రాగ్‌దర్పన్'' చదివిందిగోహర్ జాన్. అందులో తంవరీ, ఠుమ్రీ ఎక్కడా కనిపించలేదామెకు. కాబట్టి ఆవాదం నిరాధారమయిందని ఆమె అభిప్రాయం.

బ్రజభూమిలో రాధాకృష్ణుల రాసలీల ప్రసిద్ధమయింది. ఠాకుర్-(కృష్ణుడు) ఠకురాణీ (రాధ) శాస్త్రీయ సంగీతం గానం చేసిన తర్వాత ఠుమక్ ఠుమక్ నర్తిస్తూ లీలాపదాలు పాడేవాళ్లు. ఆలీలా పదాలే ఠుమ్రీలు. ఇంతదూరం చెప్పి ఆమె. ''పండిత్‌జీ! ఠుమ్రీ లఖ్నోది కాదు. బనారస్‌ది కాదు. మీ బ్రజభూమికి చెందిన మాఖన్-మిశ్రీయే (వెన్న-ఖండశర్కర) ప్రాచీన ఠుమ్రీ బందిషులన్నీ బ్రజభాషలోనేవున్నాయి. ఒక్కఠుమ్రీకూడ అన్య ప్రాకృత భాషల్లో కనిపించలేదు.'' అని తేల్చి చెప్పింది.

''లఖ్నో నవాబు వాజిదలీషా కత్థక్ నృత్యానికనుకూలమైన ఠుమ్రీగాయన శైలిని రూపొందించినాడంటారు గదా!'' అంటే ఆమె కించిదావేశంతో ''లఖ్నోలోని తన 'కౌసర్‌బాగ్' ( ఒక ఉద్యాన వనం పేరు) లో తానేకృష్ణుడై తవాయఫులను గోపికలుగా, రాధగా భావించి రాస్ నిర్వహిస్తూ ఠుమ్రీని అపవిత్రంచేసినాడు వాజిదలీషా. అతడు తాను చేసిన పాపాల ఫలమనుభవిస్తూ ఇప్పటికీ బృందావనంలోని ఒక మందిరంలో శిలా విగ్రహమై పడివున్నాడు. అతని ఆస్థానంలో అందరికంటె శ్రేష్ఠురాలయిన హైదర్‌జాన్ నాచిన్నతనంలో అతని అపవిత్ర నృత్య సంగీతాల గురించి అంతాచెప్పేది.'' అని ముగించింది. గోస్వామి కవన్నీ క్రొత్త విషయాలే. ఆమె వాద్యసహకారం లేకుండా తన సుమధురమైన గంధర్వ గాత్రంలో కొన్ని ఠుమ్రీలు అభినయ సహితంగా వినిపించింది. అదంతా తన గ్రంథాల్లో చేర్చుకున్నాడు గోస్వామి. గోహర్‌జాన్ గజళ్లు, ఠుమ్రీలు రచించింది.

''గౌహర్ ప్యారీ తోరీ పయ్యాపరత్‌హై
ఆజా సంవర్యా తోహే గర్వా లగాలూఁ
రస్‌కే భరే తోరే నైన్.

ఈ భైరవీ ఠుమ్రీ ఆమె రచనే - ఈ ఠుమ్రీని ఆమె తన మాదక స్వరాలతో ఎంత అద్భుతంగా పాడేదో కాని రసూలన్ బాయి తన వార్ధక్యంలో ''రస్‌కే భరేతోరైనైన్'' అని భైరవీలో పాడిన ఠుమ్రీ రికార్డు వింటుంటే ఆ సంవర్యాపాదాల మీద వాలిపోవాలనిపిస్తుంది. సంవర్యా అంటే శ్యామల వర్ణంగల కృష్ణుడు. కాన్హా, కన్హయ్యా అనే శబ్దాలు కృష్ణశబ్దానికి ప్రాకృతరూపాలు.

నలభైయేళ్ల క్రిందట హోటళ్లలో గ్రామఫోన్‌రికార్డులు హోరుండేది. అప్పటి గాయనీ గాయకులు చివర్లో తమపేరు చెప్పుకొనే వాళ్లు. కొంధరు పాడిమాటల్లో- కొందరు అదే రాగంలో - కొందరు ఉర్దూలో- కొందరు ఇంగ్లీషులో - ''మేరానామ్ జానకీ బాయి ఇల్లాబాదీ.'' ''మేరానామ్ అఖ్తర్ బాయిఫైజాబాదీ'' ''మేరానామ్ కాలూ ఖవ్వాలా'' ''మైనేమే యీాజ్ గోహర్‌జాన్ కల్కత్తేవాల్''. ఇలావుండేవి ఆపేర్లు. ఆరికార్డులిప్పుడు మార్కెట్లో దొరకవు.

బ్రజ భూమిలో అవతరించిన కృష్ణుడు ప్రేమ స్వరూపుడు. బ్రజ బాలలు (గోపికలు) అతని ప్రేమలో వెర్రివాళ్లయి వెంటపడ్డారు. అతని అల్లరి పనులకు ఆనందిస్తూనే కోపాన్ని అభినయించేవాళ్లు. అతని కోసం ఎదురు చూచేవాళ్లు. అభిసారికలై అతనికోసం సంకేత స్థలానికి వెళ్లేవాళ్లు. అతడు పరదేశం వెళ్తే విరహవ్యథతో తల్లడిల్లేవాళ్లు. ఠుమ్రీల ఇతివృత్తమంతా ఇదే. దాద్రాల ఇతివృత్తమూ ఇదే. దాద్రా ఒక ప్రత్యేక తాళబద్ధమైన రచన. ఠుమ్రీ దాద్రాల్లో అశ్లీలతకు ఆస్కారంలేదు. అష్టవిధ శృంగార నాయికల్లో విరహిణి, ప్రోషిత భర్తృక, ఖండిత, అభిసారికలు మాత్రమే కనిపిస్తారు. ఠుమ్రీల రచయితలు ఏదో ఒక 'పియా' ముద్రతో రచనలు చేసినారు. సుధర్ పియా, దరస్ పియా, లల్లన్ పియా, శ్యాంపియా, ప్రాణ్‌పియా, ప్రేమ్‌పియా, మాధవ్‌పియా, సంబర్‌రంగ్ పియా- ఇవి కొన్నిముద్రలు - వాజిదలీషా ముద్ర అఖ్తర్ పియా అని ఇదువరకే రాసినాను. భయ్యా గణపత్‌రావు ముద్రసుధర్ పియా. మాధవరావు సింధియా ముద్ర మాధవ్ పియా. గోహర్ ప్యారీ అనేది గోహర్ జాన్ ముద్ర. శ్రీలాల్ గోస్వామి మాత్రం 'కుంవర్‌శ్యామ్' ముద్రతో రచించినాడు. కొన్ని ఠుమ్రీలు సాంప్రదాయికంగా వస్తున్నవి. రచయితల పేర్లు తెలియవు.

ఠుమ్రీలను దాద్రాలను అన్నిరాగాల్లో పాడటం కుదరదు. శుద్ధరాగాల్లో పాడటమూ కుదురదు. భావానుకూలమైన ఇతర రాగాలు కలుపుకొని మిశ్రరాగాలు తయారు చేస్తారు. ఖయాల్‌లో రాగం ప్రధానం. భావం గౌణం. ఠుమ్రీలో భావం ప్రధానం. రాగం గౌణం. ఖయాల్ల చీజులు (కృతులు) కూడా చాల వరకు కృష్ణప్రేమకు సంబంధించినవే కాని ఖయాల్ పాడే వాళ్లు అందలి భావాన్ని స్పష్టంగా ప్రదర్శించే ప్రయత్నంచేయరు. చీజులైనా, బందిషులైనా రెండుమూడు వాక్యాలకు మించి వుండవు. పీలు, కాఫీ, కమాచ్, మాంజ్ కమాచ్, గారా, పహాడీ, భైరవి, తిలంగ్, దేశ్‌రాగాలు ఠుమ్రీలకనువైనవి. హేమంత్, జోగియా, శివరంజని, జింజోటిరాగాల్లో కొన్ని ఠుమ్రీలు వినిపిస్తాయి.

''యాద్ పియాకీ ఆమె. యే దుఃఖ్ సహాన జాయె.'' అనే సుప్రసిద్ధఠుమ్రీని ఉస్తాద్ బడే గులామలాఖాన్ హేమంత్‌లో అద్భుతంగా పాడినాడు. విరహిణి హృదయ తాపం. రాగం హేమంత్. చిత్రంగా వున్నది గదా! అతని ఠుమ్రీలు, అతని తమ్ముడు ఉస్తాద్ బర్కతల్‌ఖాన్ ఠుమ్రీలు అన్నీ అమరమైనవే.

''కటేనా బిరహాకీరాత్''
''కాకరూఁ సజనీ! ఆయేన బాలమా.''
''తుమ్ సంగ్ లాగే నజరియా నందకుమార్''
''హరి ఓం తత్సత్....''
''తోరి తిర్ఛీ నజరియాకే బాణ్''
''అబ్‌తో ఆవో సాజనా!''
''కంకర్ మార్ జగాయె - బమనాకే ఛోరారే.''
ఇవన్నీ ఉస్తాద్ బడేగులామలీఖాన్ ఠుమ్రిలే.

కిరాణా ఘరానాకు చెందిన ఉస్తాద్ అబ్దుల్‌కరీంఖాన్, రోషనారా బేగం, హీరాబాయి బరోడేకర్, మాణిక్ వర్మా తమ సంగీత సభసమాప్తి '' ఏకేలీ మత్ జయ్యో రాధే! బమునా కెతీర్'' అనే భైరవీ ఠుమ్రీతో చేసే సంప్రదాయాన్ని పాటించినారు. ఆఘరానాకు చెందిన ప్రభా అత్రే ''కోన్‌గలీ

గయో శ్యామ్? బతాదేకోయి,'' అనే కమాచ్ ఠుమ్రీ చాల చక్కగా పాడుతుంది. పర్వీన్ సుల్తానా. ''రసియా మోహేబులాయె.'' అనే కమాచ్ ఠుమ్రీతో కన్నీళ్లు తెప్పిస్తుంది. ''సాబ్ కహా మోసె బతియా - కహాఁ గవాయి సారిరతియా'' అనే ఖమాచ్ ఠుమ్రీలో ఖండిత నాయిక కోపాన్ని అద్భుతంగా అభినయిస్తుంది. (రాత్రి ఎవతెయింట గడిపినావు? సత్యం మాట్లాడు)

''జావో బలం నాహీబోల్'' అని సిద్ధేశ్వరీ దేవి,

''జావొ జావొ మోసేనబోలో - సౌతన్‌కేసంగ్ రహో.'' అని బేగం అఖ్తర్ ఖండిత.నాయిక అలుకను చక్కగా అభినయిస్తారు. స్వరాభినయం.

''కోయలియా మత్ కర్ పుకార్ - కరేజువామే లాగేకటార్'' అని కమాచ్ దాద్రాలో బేగం

''కోయలియా నాబోల్ డార్ - బర్వాబుత్ బైరీ హమార్'' అని భైరవీ ఠుమ్రీలో కిశోర్ అమోన్కర్ కోయిలను పాడవద్దని వేడుకుంటారు.

''పియాబిన్ నాహి ఆవత్ చైన్-యాద్ ఆవత్ హైసగరీరైన్'' జింజో టీఠుమ్రీలో ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్ విరహవేదన.

''నాజాబలమ్ పరదేశ్'' అని బేగం అఖ్తర్ పరదేశానికి వెళ్లే ప్రియున్ని వేడుకుంటే, ''నాజాపీ పరదేశ్'' అని సంధ్యాముఖర్జీ వేడుకుంటుంది. ఆమెది కమాచ్ రాగం, ఈమెది శివరంజనిరాగం.

''రోరోనైనాగం వాయె - సజనాన ఆయె,'' శివరంజనిలో నిర్మలాదేవి ఆవేదన.

''అంఖియన్ నీంద్ న ఆయె,'' అని తిలంగ్‌లో బేగం అఖ్తర్ ఆవేదన.

'' ఆజ్ సయ్యాబులాయె ఆధీరాత్ - నదియా ధీరేబహో.'' మెల్లగా ప్రవహించుమని హీరాదేవి మిశ్రానదిని వేడుకుంటుంది. ప్రియుడు అర్థరాత్రి రమ్మన్నాడు. నది విరహిణుల వైరిణి. మెల్లగా ప్రవహించదు. ''నదియా బైరీ బహే.'' అని యేడ్పు. ''పానీ భరేరీ అల్బేలాకి నార్- జమాజవ్.'' ఉస్తాద్ మొయిజుద్దీన్ రచనను బేగం అఖ్తర్, మీరా బెనర్జీ, భీంసేన్ జోషి ఎవరి పద్ధతిలో వాళ్లు చక్కగా పాడినారు. కృష్ణునితో వసంతాలాడే (హోర్) ఠుమ్రీలు అన్నీ సుందరమైనవే.

''బాజూబంద్ ఖుల్‌ఖుల్‌జాయె.'' అనే భైరవీఠుమ్రీని ఉస్తాద్ ఫయ్యాజ్‌ఖాన్ పాడిన పద్ధతి అద్వితీయమయింది.

యమునానదికి నీళ్లకోసం వెళ్లినగోపిక దారికి అడ్డునిలిచి, ముంజేతినిగట్టిగా పట్టి, గులకరాళ్లతో కుండను పగులగొట్టే అల్లరి కృష్ణున్ని తొలుత బతిమాలుకోవటం తర్వాత తిడతానని బెదరించటం, ఠుమ్రీ దాద్రాల్లోనే కాక ఖయాల్లలోనూ ఇతివృత్తమే. ఉస్తాద్ నిస్సార్ హుస్సేన్ ఖాన్, అతని శిష్యుడు హాఫిజల్‌ఖాన్ కేదార్‌రాగంలోని ఖయాల్‌లో ''నందనందన! క్వారే!'' అని పిలుస్తుంటే ఆలమందల వెంట వెళ్లిన కృష్ణున్ని యశోద పిలిచినట్లనిపిస్తుంది. హిందుస్తానీ సంగీతంలో ప్రేయసీ ప్రియుల ప్రేమగానీ, కృష్ణ ప్రేమ గాని ఎక్కడా మర్యాద మీరదు. అశ్లీలానికి ఆస్కారం కలిగించదు. గూఢార్థాలుండవు. ద్వంద్వార్థలుండవు. జీవాత్మ పరమాత్మల సంయోగాన్ని పరిరంభన, చుంబన, సంభోగ వర్ణనలతో మధ్య పరచటం వుండదు. క్షేత్రయ్యపదాలు, సారంగ పాణి పదాలు, జావళీలు అభినయానికి అనుకూలంగా, పాడటానికి తగినవిగా వుండవచ్చు. అయినా, వాటిలో వ్యంగ్య మర్యాదతోనూ, వాచ్యంగానూ వ్యక్తమయ్యే అశ్లీలత ఠుమ్రీల్లో వుండదు కనుక వాటిని ఠుమ్రీలతో పోల్చటం కుదరదు.

# ''ఓ అజ్ఞాత భారతీయుడు - నీరద్ సి. చౌధురి''

- కె. చక్రపాణి
- డి. చంద్రశేఖర రెడ్డి

సుప్రసిద్ధ భారతీయ ఆంగ్లరచయితలలో పేరెన్నికగన్న రచయిత నీరద్ సి.చౌధురి. తన అద్భుతమయిన శైలితో పాశ్చాత్య ప్రపంచాన్ని విస్మయపరిచాడు. నీరద్ చౌధురి తన శతజయంతి సంవత్సరంలో అడుగుపెట్టాడు. నీరద్ చౌధురి 23, నవంబరు 1897 న అప్పటి తూర్పుబెంగాల్ మైమన్ సింగ్ జిల్లాలోని ఈ కిశోర్‌గంజ్‌లో జన్మించాడు. మైమన్ సింగ్ జిల్లాలోని ఈ కిశోర్‌గంజ్ ఒక పట్టణం. నీరద్ చౌధురి పూర్వీకులది బన గ్రామ్ అనే ఊరు. తల్లిగారి ఊరు కాళీకచ్చా. తన ఆత్మకథలో నీరద్ చౌధురి ఈ మూడు ప్రదేశాలలోని జీవితాన్ని, చాలా విపులంగా వర్ణించాడు. నీరద్ చౌధురి విద్యాభ్యాసం కిశోర్‌గంజ్‌లోనూ కలకత్తాలోనూ జరిగింది. బి. ఏ లో విశ్వవిద్యాలయ ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు. ఎం. ఏ పూర్తిచేయలేదు. బనగ్రామ్ ఒక చిన్న గ్రామం. ఆ గ్రామంలోని అందరూ ఏదో విధంగా బంధువులే. కిశోర్‌గంజ్ చిన్న పట్టణం. కలకత్తా మహానగరం. గ్రామ, పట్టణ, నగర జీవితాలలోని భేదాన్ని నీరద్ చౌధురి విశ్లేషించాడు.

పదేళ్లు నిండేటప్పటికి షేక్స్పియర్ రచనలనూ, హోమర్ 'ఇలియడ్'నీ అప్పజెప్పడం ప్రారంభించాడు. పద్నాలుగో ఏట ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికాతో పరిచయం ప్రారంభమయింది. భారతీయ, పాశ్చాత్య సాహిత్యాలలోని మహాకావ్యాలను ఇంగ్లీషులో అధ్యయనం చేశాడు. చరిత్ర మీద విపరీతమయిన ఆసక్తి ఏర్పడింది. సైన్యాలు, యుద్ధ వ్యూహాలు, ఎత్తుగడల మీద ఆసక్తితో ఆధునిక ప్రపంచ చరిత్రలో వాటిని నిశితంగా అధ్యయనం చేశాడు. ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా ఆయనకీ విషయంలో తోడ్పడింది. తండ్రి చాలా స్వతంత్ర భావాలు కలిగినవ్యక్తి. తన పిల్లలు ఈ విధంగా ప్రవర్తించాలని, ఉండాలని ఆయనఎప్పుడూ నిర్దేశించలేదు. విస్తృతమయిన స్వేచ్ఛనిచ్చాడు. పిల్లలు ఏమి అడిగితే అది ఇచ్చాడు. వారు సలహా అడిగినప్పుడే ఆయన తన అభిప్రాయాన్ని చెప్పేవాడు. తన సలహాను పాటించి తీరమని వత్తిడిచేసేవాడు కాదు. పిల్లలకు పుస్తకాలు చదవడంలో ఆసక్తిని పెంపొందించింది ఆయనే. ఎన్నో మంచి పుస్తకాలను కొని బహుకరించడమేగాక, ప్రత్యేకంగా వాళ్లు నచ్చిన పుస్తకాలు కొనుక్కోవడం కోసం డబ్బు ఇస్తూ ఉండేవాడు. బహుశా ఆరోజుల్లో పిల్లలు పుస్తకాలు కొనుక్కోవడం కోసమని అంతడబ్బు కేటాయించిన తండ్రులు ఎక్కడోగాని ఉండి ఉండరు. పుస్తకాలు చదవడంలోనూ, స్వతంత్రమయిన అభిప్రాయాలు ఏర్పరచుకోవడంలోనూ నీరద్‌చౌధురి మీద తండ్రి ప్రభావం చాలా ఉంది.

నీరద్ చౌధురి ఒకరచయితగా ప్రపంచానికి తెలిసింది 1951లో 'ఒక అజ్ఞాత భారతీయుడి ఆత్మకథ ( ది ఆటో బయాగ్రఫీ అఫ్ యాన్ అన్‌నోన్ ఇండియన్) ' ద్వారా. పాశ్చాత్య ప్రపంచంలో ఈ పుస్తకం ఎన్నో ప్రశంసలను పొందింది. కాని భారత వ్యతిరేకత భావాల వల్ల మనదేశంలో ఎన్నో విమర్శలకు గురయింది నీరద్ చౌధురి ఈ గ్రంథరచనవల్ల దూషణలకు, తిరస్కారాలకు లోనయ్యాడు. తరువాతి కాలంలో దేశం విడిచి ఇంగ్లాండులో స్థిరపడడానికి కూడా ఇదే కారణమయింది. 1920 దశకాంతంలో కాథరైన్ మేయో అనే అమెరికన్ యువతి 'మదర్ ఇండియా' అనే గ్రంథం ప్రచురించింది. ఈమె 1925లో ఇక్కడ ఆరోగ్య పారిశుధ్య పరిస్థితులను అధ్యయనం చేసి సిద్ధాంతగ్రంథం రాయాలని భారతదేశం వచ్చింది. ఆమె గ్రంథం భారతీయులలోని

★ **శ్రీ కె. చక్రపాణి, డా॥ డి. చంద్రశేఖర రెడ్డి** గార్లు - ఇద్దరూ ఆంధ్ర సారస్వత పరిషత్ కాలేజీ, హైదరాబాద్‌లో ఆంగ్ల, తెలుగు శాఖలలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

దురాచారాలను ఎత్తిచూపి బ్రిటిషుపాలనను ప్రశంసించడంతో దీనిమీదఎంతో వ్యతిరేకత వచ్చింది. ఈమె అభిప్రాయాలను ఖండిస్తూ పుస్తకాలు వచ్చాయి. భారతదేశాన్ని, భారతీయులను అప్రతిష్ఠపాలు చేయడమే ఈ గ్రంధ లక్ష్యమని విమర్శించారు. మేయోమాత్రం తాను చెప్పినవన్నీ సత్యాలేనన్నది. తన గ్రంధాన్ని భారత ప్రజలకే అంకితం ఇచ్చింది. ' ఒక అజ్ఞాత భారతీయుడి ఆత్మ కథ' ద్వారా నీరద్ సి.చౌధురి రెండవ కాధరైన్ మేయోగా అభివర్ణింప బడ్డాడు. నీరద్ చౌధురి ఈ గ్రంధాన్ని బ్రిటీషు సామ్రాజ్యస్మృతికి అంకితం చేశాడు. మనలో ఉన్న జీవచైతన్యమూ, ఉన్న మంచీ అంతా ఈ బ్రిటీషు పాలన నిర్మించి, రూపొందించి, వేగవంతం చేసిందేనన్నాడు. అందుకే యజమాని ' ఇంగ్లాండు' అన్నప్పుడల్లా తోక ఆడించడం నేర్చిన కుక్కగా కొందరు విమర్శకులు కఠోరంగా దూషించారు. దేశభక్తులూ, జాతీయవాదులూ ఈ రచన హానికరమయిన దన్నారు. దేశం వెలుపల ఈ రచన పొందే గౌరవం పెరిగిన కొద్దీ దేశంలో దీనికి వ్యతిరేకత పెరగసాగింది.

'ఒక అజ్ఞాత భారతీయుడి ఆత్మకథ'ను 1951లో లండన్‌లోని మాక్మిలన్ అండ్ కంపెనీ ప్రచురించింది. సుమారు ఐదువందల పేజీల ఈ గ్రంథంలో నీరద్ చౌధురి బాల్యయవ్వనాలు, ఆ సమయంలో ఆయన నివసించిన ప్రదేశాలు, అక్కడి జీవనమూ, ఇంగ్లీషువాళ్లూ వాళ్లను గురించి దేశీయులు చెప్పుకునే కట్టుకథలూ, ఇంగ్లీషువారిపట్ల దేశీయుల ప్రవర్తనా, భారతదేశ రాజకీయ చారిత్రక పరిస్థితుల విశ్లేషణా ప్రధానంగా చోటు చేసుకున్నాయి. జాతీయోద్యమం పట్లా, జాతీయ నాయకుల పట్లా నీరద్ చౌధురికి సదభిప్రాయం లేదు. '' ఆకాశంతో పాటు పైన ఒక స్థిరమయిన న్యాయం; న్యాయ పాలనా వ్యవస్థ అవిశ్రాంతంగా కింద ఏమి జరుగుతూ ఉందో పరిశీలిస్తూ ఉంది. హద్దుమీరినప్పుడు నియంత్రిస్తూ ఉంది. సామాన్య ప్రజలు దాన్నింకా కంపెనీ అంటున్నారు, తక్కినవాళ్లు విక్టోరియారాణి అంటున్నారు, చదువుకున్నవాళ్లు ప్రభుత్వం అంటున్నారు. నిరంతరమూ ఏం జరుగుతూ ఉన్నదో గమనిస్తూ, పరిరక్షిస్తూ ఉన్న ప్రభుత్వం ఒకటి పైన ఉన్నదనే ఆశ్వాసన 1905లో జాతీయ ఆందోళన ప్రారంభంకావడంతో ఒక్కదెబ్బతో మాయమయిపోయింది. తరవాత ప్రభుత్వం అంటే మనం ఒక పీడక వ్యవస్థఅనీ, ఆక్రమణ దారులనీ భావిస్తున్నాం. అయినా పూర్వపు ప్రకాశాన్ని కోల్పోయినప్పటికీ దాని పరిరక్షణ శక్తి మరెన్నోదశాబ్దాలు కొనసాగింది. పైన ఉన్నది అచంచలమన్న విశ్వాసం తునాతునకలైపోయింది, మన పాదాలకింద స్థిరంగా ఉందనుకున్న రాతి పునాదులు ధూళిలో కలిసిపోతున్నాయి. అంతా నశించి పోతూ ఉంది,'' అంటాడు.

ఇంగ్లీషు వాళ్లంటే జనం వ్యాప్తిలో కధలు, పిల్లలకు వాళ్లను గురించే చెప్పేవిషయాలు ఎంత అహేతుకంగా ఉన్నాయో వివరించాడు. ఇంగ్లీషు వాడు మనదేశంలో అరటిపండు చూస్తే కోతిలా మీదపడి తన్నుకు పోతాడట. ఇంగ్లీషు వాళ్లు తెల్లగా ఉండడానికి విచిత్రమయిన కారణాలు చెప్పుకొనేవారట. దీన్ని నీరద్ చౌధురి చాలా ఘాటుగా విమర్శించాడు. వాళ్లు తెల్లగా ఉండడానికి వాళ్లు దుర్మార్గులు కావడమే కారణంగా మనవాళ్లు చెప్తున్నారనీ, తననల్లదనాన్ని సమర్థించుకోవడానికి తనకంటే తెల్లగా ఉండే ప్రతివిదేశీయుడూ ఓ కుష్ఠురోగిగాభావించుకొని ఆనందిస్తున్నారట మనవాళ్లే పెళ్లిచేసుకోవాలంటే తెల్లని పిల్లకోసం వెదుకుతారు. మరి ఈ వ్యత్యాసమెందుకు అని ప్రశ్నించాడు. మనలోని ద్వంద్వవిలువల్ని విమర్శించాడు. స్వాతంత్ర్యానికి కొంచెం ముంద ఒకసారి నెహ్రూను భారతదేశానికి మకుటం లేనిమహారాజుగా ప్రశంసిస్తూ గాంధీ నెహ్రూన 'హారో విద్యార్థి' గా, 'కేంబ్రిడ్జి గ్రాడ్యుయేటు' గా, 'బారిస్టరు'గా పేర్కొంటూ, భవిష్యత్తులో భారత అధ్యక్షులు ఇంగ్లీషులో నేర్చుకోవలసి అవసరం లేదన్నాడట. ''భారత రాజకీయరంగంనుం

ఇంగ్లీషువాడు అదృశ్యం కావడం వల్ల మనలో బానిసత్వ మనస్తత్వం కానీ, అసూయకానీ తొలగిపోలేదు. పైగా పై మహాత్మా గాంధీ వాక్యాలు నిజమైన ఇంగ్లీషు వాడి పట్ల ఉన్న ఆరాధనా, అసూయా భావాలు ఇంగ్లీషు అనుకర్త వైపు మరలడాన్ని సూచిస్తున్నాయి' అన్నాడు నీరద్ చౌధురి.

మనకు మన సంస్కృతి గురించి ఏమీ తెలియదనీ, ఆధునిక కాలంలో మన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు తదితర సంస్కృత వాఙ్మయాన్ని మనలో సంస్కృతంలో చదివి అర్థం చేసుకొనే వాళ్ల సంఖ్య అత్యల్పమనీ చెప్తూ, మన మతం గురించి మనం ఇంగ్లీషులోనే చదువుతున్నామనీ, మన ప్రాచ్య విద్య పాశ్చాత్యులు వెలికి తీసిందేనంటాడు. మనం మరచిపోయిన శాస్త్రాలనూ, సాహిత్యాన్ని మళ్లీ మనకు పరిచయంచేసింది పాశ్యాత్యులేనంటాడు. మనకు మన సాంస్కృతికస్పృహ పాశ్చాత్యులిచ్చిందేనంటాడు. అందుకే ప్రాచ్యవిద్యను 'పాశ్చాత్య ప్రాచ్యవిద్య' అనాలి అంటాడు.

హిందువు నిర్వచనమేమిటి? ముస్లిం కాకపోవడమే. ముస్లిం అంటే హిందువు కానివాడు, సిక్కు అంటే హిందువుకాని, ముస్లింకాని కానివాడు. మన మత నిర్వచనాలివే నన్నది నీరద్ చౌధురి అభిప్రాయం. హిందూ ముస్లిం విభేదాలను గురించి రాస్తూ ఈ విభజన 1947లో రాజకీయంగా జరిగింది కాని మన పాఠశాలల్లో అంతకంటే చాలా పూర్వమే జరిగిందన్నాడు.

నీరద్ సి.చౌధురి చరిత్రను చాలా గాఢంగా అధ్యయనం చేశాడు. బెలోచ్ గ్రీకిస్కే గెస్కిక్తే(Griechische Geschichte)అనే గ్రంథం రాశాడు. బుసోల్ట్ కూడా ఇదే పేరుతో మరోగ్రంథం రాశాడు. ఈ రెండు గ్రంథాలూ ముఖ్యంగా బుసోల్ట్‌రచన అసలు చరిత్ర గ్రంథం ఎలా ఉండాలనడానికి ఆదర్శమని నీరద్ చౌధురి అభిప్రాయం. ఈ రెండు గ్రంథాలూ చరిత్ర అధ్యయనంలో ఆయనమీద అపారమైన ప్రభావం చూపాయి. నీరద్ చౌధురి ' ఒక అజ్ఞాత భారతీయుడి ఆత్మకథ' లో ఈ చరిత్రాధ్యయనం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. భారత చరిత్రమీద రాజకీయాల మీద విపులమయిన చర్చ చేశాడు. ''శతాబ్దాలుగా భారతీయ కర్షకుల, కార్మికుల ఏకైక రాజకీయ సిద్ధాంతం: తమ పాలకుల మాటల్ని, ఉద్దేశాల్ని, చేతల్ని ఎన్నడూ నమ్మవద్దు. ప్రభుత్వమూ, పాలకుల పట్ల వాళ్ల అవిశ్వాసం తొలగించరానిది''.

జాతీయోద్యమతత్వం గురించి నీరద్ చౌధురి సుదీర్ఘంగా చర్చించాడు. ఇది మూడు విధాలుగా ఉందంటూ మూడోది గాంధీయిజంగా పేర్కొన్నారు. గాంధీ గురించీ, భారతీయ సామాన్య జనంగురించీ రాస్తూ చివరికి భారత దేశంలో జనమూ, నాయకుడూ ఒకటే అయ్యారంటాడు. గాంధీ గురించి నీరద్ చౌధురి కించపరిచే విధంగా రాశాడు. ''జీవితంలో ఆయన (గాంధీ) స్థాయికాని, ఆయన ఆంగ్ల విద్యకాని మేధోపరమైన విషయాలను, నాగరికతను అర్థం చేసుకోవడానికి తోడ్పడలేదు''.

భారతదేశ చరిత్రను గురించి రాస్తూ ''సాహిత్యం, కళ, తత్వశాస్త్రం, రాజనీతి సంబంధమయిన వివిధ దశలు ఆధునిక భారతదేశంలో ఒక దశ నుండి ఒకటిగా అభివృద్ధి చెందినవి కావు, వాటికి సహజమయిన సంబంధం కనబడదు'' అని విశ్లేషించాడు.

నాటి కలకత్తా నగర జీవితాన్ని నీరద్ చౌధురి విస్తారంగా వర్ణించాడు. ''కలకత్తా వాసుల బలమయిన పశువుల మందతత్వం కుటుంబజీవనాన్ని సమూలంగా నాశనం చేసింది.'' అంటాడు. కలకత్తావాసులు ఉదయం పనకి మాలిన కబుర్ల కోసం వీధులవెంట తిరుగుతారట,

మధ్యాహ్నం ఆఫీసు, సాయంత్రం సమావేశాలు, రాత్రి ఇంటికి చేరింతర్వాత భార్యాపిల్లలతో మాట్లాడితేకేవలం కుటుంబ సమస్యలగురించి మాత్రమేనట. కలకత్తా వాసులలోని మురాతత్వాన్ని కూడా నీరద్ చౌధురి విమర్శించాడు.

''భారత దేశంలోని సామాన్య జనం పాశ్చాత్య దేశాలపట్ల తమ తిరస్కారాన్ని ఒకవైపుచూపి స్తారుకాని, గత శతాబ్దంలోని భారతీయ మహాపురుషులంతా పాశ్యాత్యప్రపంచం గుర్తించేవరకూ తమదేశంలో గుర్తింపు పొందలేకపోయారు, ఏ విధమైన ప్రభావాన్నీ చూపించలేకపోయారు..నోబెల్ బహుమానం అందుకునేవరకు టాగోర్‌ను దాదాపు ఒక పామరుడిగానే చూశారు..పరీక్షలో టాగోర్ రచన నుండి ఒక వాక్యం ఇచ్చి దాన్ని స్వచ్ఛమయిన బెంగాలీలోకి మార్చమని అడిగారు'' ఇది భారతీయుల ఆలోచనలోని అతి పెద్ద వైరుధ్యం అంటాడు నీరద్ చౌధురి. ఇంగ్లీషు మీద వ్యామోహం, ఇంగ్లీషు వాళ్ల గుర్తింపు పట్ల గర్వం భారతీయులందరితో పాటు నీరద్ చౌధురిలో కూడా ఉంది. తోరూదత్ గురించి '' ఒక బెంగాలీ అమ్మాయి ఆంగ్ల సాహిత్యంలో ఒక స్థానాన్ని సంపాదించడం నాకెంతో గర్వాన్ని కలిగించింది. నా సహోదరుడూ గర్వపడ్డాడు, అదే విధంగా నా తల్లిదండ్రులు కూడా గర్వపడ్డారు'' అంటాడు.

నీరద్ చౌధురి 1955లో బిబిసి కోసం తొలిసారి ఇంగ్లాండు వెళ్లాడు. ఈ యాత్రానుభవాలను ' ఎ పాసేజ్ టు ఇంగ్లాండ్'లో నిక్షిప్తం చేశాడు. నీరద్ చౌధురి రచించిన 'ది కాంటినెంట్ ఆఫ్ సర్సీ' కి డఫ్ కాపర్ మెమోరియల్ బహుమానం లభించింది. ఈ బహుమానం స్వీకరించడానికి ఆయన రెండోసారి 1966లో ఇంగ్లాండు వెళ్లాడు. మాక్స్ ముల్లర్ జీవితచరిత్ర రాయడం కోసం 1968లో నీరద్ చౌధురి ఆక్స్ ఫర్డులో ఆరునెలలున్నాడు. 1970లో హిందుయిజం మీద పుస్తకం రాయడానికి లార్డ్ వైడన్ ఫెల్డ్ నీరద్ చౌధురిని ఇంగ్లాండుకు ఆహ్వానించాడు. అప్పుడు ఇంగ్లాండు వెళ్లిన నీరద్ చౌధురి మళ్లీ భారతదేశానికి తిరిగి రాలేదు. ఆయన ఇంగ్లాండులో స్థిరపడడానికి ప్రధాన ప్రోద్బలం ఆయనభార్య. రచయిత కాదలచుకుంటే ఇంగ్లాండులో స్థిరపడడం ఉత్తమమని ఆమెభావించింది. చౌధురి మాత్రం మొదట ఇంగ్లాండులో స్థిరపడాలని అనుకోలేదనీ, ఈ నిర్ణయం ఆయన 1980లో మాత్రమే తీసుకున్నాడని ఆయన కుమారు డంటాడు.

నీరద్ చౌధురిని ఒక సజీవ విజ్ఞాన సర్వస్వంగా అభివర్ణించవచ్చు. ఆయనది విస్తృతమయిన అధ్యయనం. చరిత్రను, సంస్కృతిని గాఢంగా అధ్యయనం చేశాడు. తన అధ్యయనం వల్ల ఏర్పడిన ప్రమాణాలే తన ఆలోచనలను, దృక్పథాన్ని ప్రభావితం చేశాయంటాడు చౌధురి. ఒక విశ్వజనీన స్థాయిలో అన్ని చారిత్రక అనుభవాలనూ సమీక్షిస్తాయి ఆయన రచనలు. గత చరిత్ర అంతా ఆయన కనులముందు పరచుకున్నట్లుగా ఉంటుంది. ఒక చారిత్రకస్థితిని పరిశీలించడంలో ఆశనిరాశలకు ఆయనలో స్థానంలో లేదు. తన రచనల్లో కేవలం వాస్తవికతకు మాత్రమే ప్రాధాన్యమంటాడు. ఆయన అభిప్రాయంలో తాను 'భారతదేశం పతనమవుతున్నది' అంటే అది ఒక చారిత్రక రోగ నిదానమే తప్ప మరొకటి కానేకాదు. రోమన్ల కాలంనుండి నేటివరకు కొనసాగుతూ వస్తున్న యూరోపియన్ నాగరికత మరో నూరేళ్లలో సమూలంగా అదృశ్యమై పోవచ్చుననికూడా ఆయన అభిప్రాయపడ్డాడు.

నీరద్ చౌధురి శైలి బేకన్ శైలి. ఇటీవలికాలంలో భారతీయ ఆంగ్ల రచయితలలో ఆయన స్థాయికి చెందిన వారు మరెవరూ లేరు. బ్రిటీషు పార్లమెంటులో కూడా ఆయన శైలి ప్రశంసాత్మకమయిన చర్యలకు కారణమయింది. ఆయన రచించిన మాక్స్‌ముల్లర్ జీవిత చరిత్ర కేవలం ఒక జీవిత చరిత్ర మాత్రమే కాదు, అది ఒక మనస్తత్వ అధ్యయనం, ఒక యుగం

మేధోచరిత్ర, రెండు విభిన్న సంస్కృతుల సమ్మేళనం. నీరద్ చౌధురి అవగాహన, అభివ్యక్తి విమర్శకులను ఆశ్చర్యచకితులను చేస్తాయి.

నీరద్ చౌధురికి అనుభవం తక్కువ అనీ, ఆయన జ్ఞానమంతా పుస్తకాలనుండి వచ్చిందేననీ, సమకాలీన బెంగాలీ సమాజంలో వచ్చిన మార్పులు ఆయనకు తెలియవనీ, ఆయన చారిత్రక అవగాహన పరిమితమూ, అసమగ్రమూ అనీ విమర్శ ఉంది. అయితే ఆయనే ''నా జీవితం ఎండ్రకాయ వంటిది. అయినా ఒక అసాధారణమయిన విషయాన్ని నేను గమనించాను. అనుద్దేశపూర్వకంగానే యాదృచ్ఛికంగా నాయకులతో కాని, రాజకీయ, సాహిత్య ఉద్యమాలతో కాని ప్రత్యక్ష పరిచయం కలిగినప్పుడు అంతకుపూర్వమే ఈ వ్యక్తుల గురించి కాని, ఉద్యమాల గురించి కాని చదవడం వల్లనేను ఏర్పరచుకున్న అభిప్రాయాలు, భావాలు తప్పుకావనీ, ఒకటి రెండు సార్లు ప్రత్యక్షంగా చూస్తేచాలు అది ఎంత అల్పమయినదయినా పర్వాలేదు వారి స్వభావాన్ని స్పష్టంగా తెలుసుకోగలననీ గమనించాను. నేను కలకత్తా రావడం వల్ల పరిసరాలతో ఏర్పడ్డ విరక్తత నా గ్రహణ శక్తులకు పదును పెట్టి ఉండవచ్చు. నా చుట్టూ ఉన్న జీవితాన్ని దానితో విరోధం వల్లనే నేను బాగా అర్థం చేసుకోగలిగాను. 'ప్రేమ ఒక అద్భుతమయిన గురువనీ, ఈ అవగాహన ప్రేమ చక్కగా యిస్తుంద నీ' అందరూ అంటారు కాని విరోధానికి ఇటువంటి అంతర్దృష్టి ఉంటుందని ఎవరూ చెప్పలేదు. నాజ్ఞానం నత్తజ్ఞానం లాంటిది. అది తన కోమలమయిన కొమ్ములతో సంపాదించినదంతా తన గుల్లలో అతిజాగ్రత్తగా భద్రపరచుకుంటుంది''. అని చెప్పుకున్నాడు. ''భారతదేశాన్ని అర్థం చేసుకోవడానికి నేను నాలోకి చూసుకుంటే చాలు, నా జీవితాన్ని గురించి ఆలోచించుకుంటే చాలు'' అన్నాడు.

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిననాలుగేళ్లకే 'ఒక అజ్ఞాత భారతీయుని ఆత్మకథ' వెలువడింది. జాతీయ భావాలు పెల్లుబికి ఉన్న కాలంలో ఇటువంటి పుస్తకం రాసిన ఏ రచయితనయినా దేశద్రోహిగా జమకట్టడంలో ఆశ్చర్యపోవలసిందేమీలేదు. పైగా ఈ పుస్తకాన్ని బ్రిటీషు సామ్రాజ్య స్మృతికి అంకితమివ్వడం అగ్నికి ఆజ్యం పోయడమే అయింది తన నిజాయితీ పట్ల నీరద్ చౌధురికి అపారనమ్మకమే 'నాప్రజలకు నా ఏకైక బాధ్యత వారిని హెచ్చరించడమే. దీనివల్ల చెడ్డపేరు వస్తేరానీ. ఈ నా బాధ్యతను జీవిత పర్యంతమూ నిర్వహించాను. ఫలితం దేశం విడిచి బ్రతకవలసి రావడం' అని విచారపడ్డాడు.

నీరద్ చౌధురి చెప్పిన విషయాలలో వాస్తవాలే ఉన్నప్పటికీ, ఆయన వాటిని విశ్లేషించిన తీరుపట్ల అవగాహన చేసుకున్న విధానం పట్ల అభ్యంతరాలుండవచ్చు. కేవలం భారతీయ సమాజంలోని లోపాలను ఎత్తి చూపడం, ఆంగ్లసమాజాన్ని పైకెత్తడం మనకు కోపం తెప్పించడంలో అసమంజసమేమీ లేదు. మన సమస్యలకు ఇంగ్లీషు వారి పరిపాలన సమాధానమా? నీరద్ చౌధురిలోని అసంబద్ధమయిన విషయాలను పక్కకు పెట్టి ఆయన్ను సరిగా అర్థం చేసుకోవలసిన అవసరం కూడా ఉంది. పాశ్చాత్యసామాజిక, సాంస్కృతిక దివాలాకోరుతనాన్ని కూడా ఆయన చక్కగా విశ్లేషించాడు. దాన్నిమనం గుడ్డిగా అనుసరించడాన్ని విమర్శించాడు. మనలో చోటుచేసుకున్న పతోన్ముఖతను ఎత్తిచూపాడు ఆధునిక రచయితలు ముఖ్యంగా ఆంగ్లంలో రచనలు చేసేవాళ్లు నీరద్ చౌధురిశైలినుండీ నిరలంకారతను, సూటిదనాన్ని నేర్చుకోవచ్చు. తొలి రోజుల్లో ఆయన పట్ల ఉన్న తిరస్కారభావాన్ని మాని ఆయననుండి నేర్చుకోవలసిన విషయాల పట్ల దృష్టిని కేంద్రీరించవలసి ఉంటుంది.

FAC-SIMILE of a letter by OLIVER GOLDSMITH

---

If you should ask, why in an interval of so m
me, permit me, Madam, to ask the same question
crimination. I wrote to Kilmore from Leyden in Hol
and Rouen in France, but receivd no answer. To u
but to displeasure or forgetfulness. Whether
do not pretend to determine, but this I must inge
sand times in my turn endeavoured to forget them
forgetting me. I have attempted to blot their names
spent whole days in efforts to tear their images f
ceeded you had not now been troubled with this r
respondence; but as every effort the restless make to pro
them waking, all my attempts contributed to imp
on my imagination. But this is a subject I would u
the soul of me I can't till I have said all. I was,

ting to Kilmore in such circumstances that all my endeavours to continue your re-
gards might be attributed to wrong motives, my letters might be regarded as the pe-
titions of a beggar and not the offerings of a friend, while all my professions in-
stead of being considered as the result of disinterested esteem might be ascribed to ve-
nal insincerity. I believe, indeed, you had too much generosity to place them in such a
light, but I could not bear even the shadow of such a suspicion, the most delicate
friendships are always most sensible of the slightest invasion and the strongest jea-
lousy is ever attendant on the warmest regard. I could not, I own, I could not conti-
nue a correspondence where every acknowlegement for past favours might be consi-
dered as an indirect request for future ones, and where it might be thought I gave
my heart from a motive of gratitude alone, when I was conscious of having bestow-
ed it on much more disinterested principles.

It is true this conduct might have been simple enough, but your self must confess it
was in character. Those who know me at all, know that I have always been actuat-
ed by different principles from the rest of Mankind, and while none regarded the
interests of his friends more, no man on earth regarded his own less. I have often af-

fected bluntness to avoid the imputation of flattery, have frequently seemed to
overlook those merits too obvious to escape notice, and pretended? I disregard.
those instances of good nature and good sense which I could not fail tacitly
to applaud; and all this lest I should be ranked among the grinning tribe
who say very true to all that is said, who fill a vacant chair at a tea table
whose narrow souls never moved in a wider circle than the circumference of a gui
nea, and who had rather be reckoning the money in your pocket than the virtues of
your breast; all this, I say, I have done and a thousand other very silly tho' very
disinterested things in my time, and for all which no soul cares a farthing about
me. God's curse, Madam, is it to be wondered that he should once in his life for
get you who has been all his life forgetting himself.
However it is probable you may one of these days see me turned into a perfect
Hunks and as

rom in the state of my finances, I declaim against the
my tea, and check my grate with brick-bats. Instea
pictures I intend to adorn it with maxims of fru
etty furniture enough and won't be a bit too ex-
'em all out with my own hands and my landlady's
with the parings of my black waistcoat; Each
a sheet of clean paper and wrote with my best
will serve as a specimen. "Look sharp. Mind th
roney now. If you have a thousand pound, you can pu
'd say you are worth a thousand pounds every day of th
hundred pound and it will be an hundred pound no lo
turn my eyes they are sure to meet one of those
are told of an Actor who hung his room round with
defects of his person, my apartment shall be fur-
to correct the errors of my mind.
... ... penn...
Faith, Madam, I heartily wish to be rich, if it were only for this reason, to .

say without a blush how much I esteem you, but alass I have many a fatigue to encounter before that happy time comes; when your poor old friend may again give a loose to the luxuriance of his nature, sitting by Kilmore fireside recount the various adventures of an hard fought life, laugh over the follies of the day, join his flute to your harp... and forget that ever he starv'd in those streets where Butler and Otway starv'd before him.

And now I mention those great names, My Uncle - He is no more that soul of fire as when once I knew him Newton and Swift grew dim with age as well as he. But what shall I say; his mind was too active an inhabitant not to disorder the feeble mansion of its abode, for the richest jewels soonest wear their settings. Yet who but the fool would lament his condition, he now forgets the calamities of life, perhaps indulgent heaven has given him a foretaste of that tranquillity here which he ... to ... hereafter.

But I must come to business, for business as one of my maxims tells
me must be minded or lost; I am goin to publish in London A Book entitu
led, the present State of Taste and Literature in Europe; The Booksellers in
Ireland republish every performance there without making the author an
consideration I would in this respect disappoint their avarice and have
all the profits of my labours to myself. I must therefore request Mr.
Lawder to Circulate among his friends and Acquaintance an hundred
of my Proposals which I have given the Bookseller Mr Bradley
in Dame Street directions to send him, if in pursuance to such

circulation he should receive any subscriptions, I entreat when col
lected they may be sent to Mr. Bradley's as aforesaid who will
give a receipt and be accountable for the work or a return of the
subscription. If this request (which if ay complied with will in some

measure be an encouragement to a man of learning,) should be disagreeable or troublesome I would not press it, for I would be the last man on earth to have my labours go a begging, but if I know Mr Lauder and sure I ought to know him, he will accept the employment with pleasure, all I can say if he writes a book I will get him two hundred subscribers and those of the best wits in Europe. Whether this request is complied with or not I shall not be uneasy, but there is one Petition I must make to him which I solicit with the warmest ardour and which I cannot bear a refusal I mean Dr Madam. That I [illegible] my

your Ever affectionate and obliged
Kinsman [illegible]

[illegible] Oliver Goldsmith

You see how I blot and blunder
when I am asking a favour.

Temple Exchange-Coffee house near
Temple Bar Lond. Augst 15th 1758

1758 నాటి ఆలివర్ గోల్డుస్మిత్ చేవ్రాత లేఖ నకలు ప్రతి ఒకటి, **కె.జితేంద్ర**, అడ్వొకేట్, హైదరాబాద్ గారికి, యాదృచ్ఛికంగా, పేవ్‌మెంట్ మీద పుస్తకాల కొనుగోలులో ౧౯౧౧ నాటి "**Water Technology**" అనే రాతప్రతి గ్రంథంమధ్యలో దొరికింది. ఆ లేఖను వారు మిసిమికి అందజేశారు. వారికి మిసిమి కృతజ్ఞతలు చెప్పకొంటోంది.

లేఖ ప్రతి పెళుసుబారి, ముక్కలు ముక్కలై ఉంది. మొదటిపుటలు లేవు. దొరికిన కాగితాలలోకూడ మొదటికాగితం పైభాగం కుడి ప్రక్కముక్కలేదు. అలాగే ప్రచురిస్తున్నాము. గోల్డ్‌స్మిత్ చేవ్రాతను చూసి మేము పొందిన ఆనందాన్నే మా పాఠకులు పొందుతారని ఆశిస్తున్నాము.



ప్రాణంలేని కెమెరా, చేయితిరిగిన ఛాయాచిత్రగ్రాహకుని చేతిలో, కొవ్వొత్తుల జ్వాలా వీచికలకు ఊపిరిపోసింది